PRANATHI TV నిత్యప్రవచకులు...

# కాలచక్రం

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

కాలచక్రం పంచాంగకర్త
శ్రీరాజ్యలక్ష్మి విభూషణ బిరుదాంకిత
పండిత శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ



దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ మన్మథ నామ సంవత్సర మార్గశిర బహుళ సప్తమి శుక్రవారం నుంచి పుష్య బహుళ సప్తమి ఆదివారం వరకు

# 2016 JANUARY జనవరి

ప్రియమైన పాఠకులందరికీ నూతన ఆంగ్ల సంవత్సర శుభాకాంక్షలు 2016 జనవరి 9 శనివారం సూర్యోదయానికి పూర్వం తూర్పు దిక్కున శని, శుక్రుల దివ్యదర్శనాన్ని సాధారణ కన్నులతో వీక్షించండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము:సా4.15-4.59<br>రా.కా: సా4.30-6.00 | 31<br>బ.సప్తమి రా7.44<br>చిత్ర ఉ10.52<br>వ.సా5.09-6.56 | 3<br>బ.నవమి రా2.59<br>చిత్ర రా2.37<br>వ.ఉ8.36-10.24 | ● 10<br>అమావాస్య ఉ7.00<br>పుష్య శు.పాడ్యమి తె5.40<br>పూర్వాషాఢ ఉ9.42<br>వ.సా5.27-7.00 | 17<br>శు.అష్టమి మ3.58<br>అశ్వని రా11.58<br>వ.రా8.10-9.41 | ○ 24<br>పుష్యపూర్ణిమ ఉ7.16<br>పుష్యమి రా8.44<br>వర్జ్యం లేదు |
| MON సోమ<br>దుర్ము:మ12.34-1.19<br>మ2.47-3.31<br>రా.కా:ఉ7.30-9.00 | | 4<br>బ.దశమి తె5.13<br>స్వాతి తె5.18<br>వ.ఉ8.51-10.37 | 11<br>శు.విదియ తె4.00<br>ఉత్తరాషాఢ ఉ8.58<br>వ.మ12.47-2.19 | 18<br>శు.నవమి మ2.05<br>భరణి రా10.48<br>వ.ఉ9.06-10.37 | 25<br>బ.పాడ్యమి ఉ7.33<br>ఆశ్లేష రా9.55<br>వ.ఉ10.10-11.51 |
| TUE మంగళ<br>దుర్ము:ఉ8.54-9.38<br>రా10.55-11.47<br>రా.కా: మ3.00-4.30 | | 5<br>బ.ఏకాదశి పూర్తిగా<br>విశాఖ పూర్తిగా<br>వ.మ11.24-1.08 | 12<br>శు.తదియ రా2.06<br>శ్రవణం ఉ7.55<br>వ.మ11.42-1.13 | 19<br>శు.దశమి మ12.19<br>కృత్తిక రా9.46<br>వ.ఉ10.17-11.49 | 26<br>బ.విదియ ఉ8.26<br>మఖ రా11.40<br>వ.ఉ10.47-12.30 |
| WED బుధ<br>దుర్ము:మ11.51-12.35<br>రా.కా: మ12.00-1.30 | | 6<br>బ.ఏకాదశి ఉ6.54<br>విశాఖ ఉ7.27<br>వ.మ11.42-1.24 | 13<br>శు.చవితి రా12.05<br>ధనిష్ఠ ఉ6.40<br>శతభిషం తె5.19<br>వ.మ1.28-2.58 | 20<br>శు.ఏకాదశి ఉ10.43<br>రోహిణి రా8.54<br>వ.మ1.12-2.44<br>వ.రా2.22-3.55 | 27<br>బ.తదియ ఉ9.55<br>పూర్వఫల్గుణి రా1.58<br>వ.ఉ8.26-10.11 |
| THU గురు<br>దుర్ము:ఉ10.23-11.07<br>మ2.49-3.33<br>రా.కా:మ1.30-3.00 | | 7<br>బ.ద్వాదశి ఉ7.54<br>అనూరాధ ఉ8.57<br>వ.మ2.45-4.24 | 14<br>శు.పంచమి రా10.01<br>పూర్వాభాద్ర రా3.56<br>వ.మ11.21-12.51 | 21<br>శు.ద్వాదశి ఉ9.20<br>మృగశిర రా8.18<br>వ.తె4.36-6.10 | 28<br>బ.చవితి మ11.57<br>ఉత్తర తె4.44<br>వ.ఉ10.00-11.47 |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.52-9.36<br>మ12.33-1.17<br>రా.కా:ఉ10.30-12.00 | 1<br>బ.సప్తమి రా9.39<br>ఉత్తర రా8.28<br>వ.తె5.58 లగాయితు | 8<br>బ.త్రయోదశి ఉ8.14<br>జ్యేష్ఠ ఉ9.48<br>వ.సా5.52-7.29 | 15<br>శు.షష్ఠి రా7.57<br>ఉత్తరాభాద్ర రా2.33<br>వ.మ12.59-2.29 | 22<br>శు.త్రయోదశి ఉ8.14<br>ఆర్ద్ర రా8.00<br>వర్జ్యం లేదు | 29<br>బ.పంచమి మ2.24<br>హస్త పూర్తిగా<br>వ.మ2.11-4.00 |
| SAT శని<br>దుర్ము:ఉ6.40-8.08<br>రా.కా:ఉ9.00-10.30 | 2<br>బ.అష్టమి రా12.22<br>హస్త రా11.35<br>వ.శేషం ఉ7.46 వరకు | 9 Bank Holiday Every 2nd, 4th<br>బ.చతుర్దశి ఉ7.54<br>మూల ఉ10.01<br>వ.ఉ8.24-10.01<br>వ.రా7.30-9.04 | 16<br>శు.సప్తమి సా5.56<br>రేవతి రా1.13<br>వ.మ1.53-3.24 | 23<br>శు.చతుర్దశి ఉ7.31<br>పునర్వసు రా8.08<br>వ.ఉ8.04-9.40<br>వ.తె4.20-5.58 | 30<br>బ.షష్ఠి సా5.05<br>హస్త ఉ7.46<br>వ.సా4.48-6.36 |

### పండుగలు

1 ఆంగ్లసంవత్సరాది
6 సఫలైకాదశి
8 మాసశివరాత్రి
11 పుష్యమాస చంద్రోదయం
12 రబ్బీసాని నెలారంభం
14 భోగి
15 మకరసంక్రాంతి, ఉత్తరాయణప్రారంభం
16 కనుమ, పక్షిపూజ
17 ముక్కనుమ
19 రైవతమన్వాది
20 పుత్రదాఏకాదశి
26 రిపబ్లిక్‌డే
27 సంకష్టహరచతుర్థి

### మకరసంక్రమణం

14 గురువారం అర్ధరాత్రి తదుపరి 1గం॥26ని॥లకు (తెల్లవారితే శుక్రవారం 15 జనవరి) మకరరాశిలోనికి సూర్యప్రవేశం జరుగును. పందివాహనంపై మంద అను నామముతో మకరసంక్రాంతి పుణ్య పురుషుడు ఉండును. 15 సంక్రాంతి పండుగ

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### జనవరి శుభసమయములు

శ్రీ మన్మథ మార్గశిరమాసము

| | |
|---|---|
| 01 | శుక్ర బ.సప్తమి ఉత్తర ఉ7.40-8.51 |
| 01 | శుక్ర బ.సప్తమి ఉత్తర సా4.32-8.28 |
| 02 | శని బ.అష్టమి హస్త ఉ8.09-9.27 |
| 02 | శని బ.అష్టమి హస్త సా4.28- రా8.51 |
| 03 | ఆది బ.నవమి చిత్ర ఉ7.32- 8.35 |
| 03 | ఆది బ.నవమి చిత్ర సా5.00- రా8.45 |
| 04 | సోమ బ.దశమి స్వాతి ఉ7.28-8.50 |
| 04 | సోమ బ.దశమి స్వాతి సా4.20-రా8.43 |

శ్రీ మన్మథ పుష్యమాసము

| | |
|---|---|
| 11 | సోమ శు.విదియ ఉత్తరాషాఢ ఉ7.00-8.51 |
| 11 | సోమ శు.విదియ ఉత్తరాషాఢ సా6.04-రా8.15 |
| 13 | బుధ శు.చవితి శతభిషం ఉ6.52-8.43 |
| 15 | శుక్ర శు.షష్ఠి ఉత్తరాభాద్ర ఉ6.44-8.35 |
| 15 | శుక్ర శు.షష్ఠి ఉ.భాద్ర సా5.48-రా7.59 |
| 16 | శని శు.అష్టమి రేవతి సా5.44-రా7.55 |
| 17 | ఆది శు.అష్టమి అశ్వని మ1.27-3.27 |
| 17 | ఆది శు.నవమి అశ్వని సా6.40-7.51 |
| 20 | బుధ శు.ద్వాదశి రోహిణి సా5.28-7.39 |
| 21 | గురు శు.త్రయోదశి మృగశిర మ1.11-2.54 |
| 21 | గురు శు.త్రయోదశి మృగశిర సా5.24-రా7.35 |
| 23 | శని పూర్ణిమ పునర్వసు మ1.03-3.03 |
| 23 | శని పూర్ణిమ పునర్వసు సా5.16-7.27 |
| 24 | ఆది బ.పాడ్యమి పుష్యమి మ12.59-2.59 |
| 24 | ఆది బ.పాడ్యమి పుష్యమి సా5.12-రా7.23 |
| 28 | గురు బ.పంచమి ఉత్తర మ12.42-2.43 |
| 28 | గురు బ.పంచమి ఉత్తర సా4.56-7.07 |
| 29 | శుక్ర బ.పంచమి హస్త మ1.29 -2.10 |
| 29 | శుక్ర బ.షష్ఠి హస్త సా4.52-రా7.03 |
| 31 | ఆది బ.సప్తమి స్వాతి మ12.31-2.31 |
| 31 | ఆది బ.అష్టమి స్వాతి రా9.02-11.06 |

*Engagements*

## మూల నక్షత్రం రోజున శని, శుక్రుల దివ్యదర్శనం

శ్రీ మన్మథ నామ సంవత్సర మార్గశిర బహుళ చతుర్దశి, మూల నక్షత్రం సరియగు తేది 9 జనవరి 2016 శనివారం సూర్యోదయమునకు పూర్వము తూర్పు దిశలో శని గ్రహము మరియు శుక్రగ్రహము ప్రక్కప్రక్కనే ఉండి దర్శనం ఇవ్వనున్నారు. వృశ్చికరాశిలో శని,శుక్ర గ్రహముల కలయిక జరిగింది. ప్రత్యేకంగా జనవరి 9 సూర్యోదయమునకు ముందు సాధారణ కన్నులతో ఈ రెండు గ్రహములను వీక్షించవచ్చును.

అష్టమ శని జరిగే మేషరాశి జాతకులు, అర్ధాష్టమ శని పీరియడ్ నడిచే సింహరాశి జాతకులు, ఏలినాటి శని మూడవ భాగం నడుస్తున్న తులారాశి జాతకులు, ఏలినాటిశని రెండవభాగంలో నున్న వృశ్చికరాశి మరియు ఏలినాటి శని మొదటి భాగం జరుగుచున్న ధనస్సురాశి వారు... ప్రస్తుతం శని మహాదశ నడుస్తున్న జాతకులందరూ తప్పనిసరిగా శనివార సూర్యోదయమునకు పూర్వము 90 నిముషాలు పాటు ఈ దివ్యదర్శనాన్ని దర్శించుకొనేది. మిగిలిన రాశుల వారు కూడా దర్శించుకొనవచ్చును. మకర, కుంభ రాశులకు అధిపతిగానున్న శనిగ్రహం, వృషభ తులారాశులకు అధిపతిగా ఉన్న శుక్ర గ్రహము జ్యోతిషశాస్త్ర రీత్యా మిత్ర గ్రహములు.

జనవరి 30వ తేది నుంచి గురువు రాహువుతో కలిసి గురుచండాలయోగం ఏర్పడనుంది. ఇది 2016 అక్టోబరు 11 వరకు ఉండును. కనుక ద్వాదశ రాశుల వారందరూ ఈ చండాల యోగ ఫలిత నివృత్తి కోసంగా ప్రాథమికంగా మూల నక్షత్రంలో కనపడే శని, శుక్రుల దివ్యదర్శనాన్ని వీక్షించినచో ఉపశమనం కల్గునని పురాతన గ్రంథాలు పేర్కొంటున్నాయి.

సూర్యోదయం పూర్వమే తూర్పుదిక్కులో షుమారు 90 నిముషాల పాటు దర్శనముండును. అంటే 5 గంటల నుంచి ఈ రెండు గ్రహాలను వీక్షించవచ్చును. కనుక ఈ సమయంలోనే శరీర, మానసిక శుద్ధులతో ద్వాదశరాశుల వారు భక్తి, విశ్వాసాలతో దర్శించి ప్రార్థించండి.

జనవరి 9 శనివారం సూర్యోదయం తదుపరిన శ్రీ లలితా సహస్రనామ స్తోత్రం గానీ, లలితా త్రిశతి గానీ, విష్ణు సహస్రనామ స్తోత్రం గానీ, నమక చమక పారాయణములు గానీ భక్తి విశ్వాసములతో చేయవచ్చును. ఈ రెండు గ్రహాలు దివ్యదర్శనం శుభకరమే కానీ అశుభకరం కానే కాదు. వివాహములు కావలసినవారు, వివాహంలో సమస్యలు ఎదురవుతున్న వారు, ఎన్ని ప్రయత్నాలు చేసిననూ వివాహం ఫలించకుండా ఉన్నవారందరూ ఈ దివ్య దర్శనాన్ని వీక్షించండి. మీతో పాటు మీ బంధు మిత్రాదులందరికీ దివ్యదర్శనాన్ని గురించి తెలియజేస్తూ సహకరించండి. - శ్రీనివాసగార్గేయ, 9346032385, 9348032385

## 27 నక్షత్రాలలో చేయదగిన విశేష పరిహారములు

**అశ్వని నక్షత్రం :** సోమ, మంగళ, బుధ గురువారాలలో అశ్వని నక్షత్రం వచ్చినట్లయితే ఆయారోజుల లోని యమగండకాలములో (కేతుకాలమని అర్ధము) రెండు లేక మూడు ఎండు ఖర్జూరాలను తినండి. సోమవారం ఉదయం 10.30 నుంచి 12.00 వరకు, మంగళవారం ఉదయం 9.00 నుంచి 10.30 వరకు, బుధవారం ఉదయం 7.30 నుంచి 9.00 వరకు, గురువారం ఉదయం 6.00 నుంచి 7.30 వరకు కేతుకాల సమయాలలో ఎండు ఖర్జూరాలను తిన్నందున పరోక్షంగా మంచి నిర్ణయాలు ఆరోగ్యంపై తీసుకుందురు. అందుచే అనారోగ్య వ్యాప్తికి అడ్డుకట్ట పడును.

**భరణి నక్షత్రం :** భరణి నక్షత్రం ఆదివారం నాడు వచ్చినట్లయితే మనసును లగ్నం చేస్తూ కనకధారాస్తోత్రాన్ని పఠిస్తూ లక్ష్మీదేవిని ప్రార్థించి, బెల్లంతో చేసిన పాయసాన్ని నివేదించండి. ఈ నివేదనను కుటుంబ సభ్యులందరూ ప్రసాదంగా స్వీకరించండి. ఈ విధంగా కనీసం 40 సార్లు ఆచరిస్తే... ప్రసాదం స్వీకరించిన వారందరూ మానసికంగా సంతోషంతో ఉంటూ...సరియైన రీతిలో ధన సముపార్జనకు సమాయత్తులగుదురు.

**కృత్తిక నక్షత్రం :** కృత్తిక నక్షత్రం బుధవారం వస్తే గోధుమపిండిలో ఆవుపాలు లేక గేదె పాలు పోసి, ఉప్పువేసి నూనె లేకుండా కాల్చిన రొట్టెలను యాచకులకు తృప్తిగా అందజేయండి. వారందుకునే సమయంలో యాచకుల కళ్లలోని ఆనందాన్ని... మీరు కూడా తదేకంగా గమనించి తృప్తి పొందండి. ఇందుచేత ఆత్మకారకుడైన రవి, మీకు కూడా వృద్ధి చెందుతూ.. సమస్యలున్న సమయాలలో విశేష సమయస్ఫూర్తిని పాటించగలరు.

**రోహిణి నక్షత్రం :** అనేకానేక అంశాలపై వివిధ ఆలోచనలతో బాధపడే వారు మంగళ, ఆదివారాలలో రోహిణి నక్షత్రం వచ్చినట్లయితే ఉదయం నుంచి రాత్రి నిదురించే వరకు నలుపు రంగు దుస్తులనే ధరించండి. దీని ప్రభావంచే మీ ఆలోచనా ధోరణిలో మార్పులు కల్గి అధైర్యపడకుండా ధైర్యవంతులుగా ఉండగలుగుదురు. ఎన్ని వారాలైనా చేయవచ్చు.

**మృగశిర నక్షత్రం :** మృగశిర నక్షత్రంలో జన్మించిన చిన్న పిల్లలు ఉంటే, వారికున్న జ్ఞాపకశక్తి మరికొంత బలీయం చేయటానికి ఓ చిన్న చిట్కా ఉన్నది. ఆదివారం నాడు మృగశిర నక్షత్రం సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు ఉండి తీరాలి. అట్టి రోజున అరకప్పు కాచిన ఆవుపాలలో ఓ బెల్లం ముక్క, పావుచెంచా తేనె కలిపి ఉదయం ఏడు గంటల లోపలనే వారికి అందించండి. తెలివితేటలు అభివృద్ధి దిశలో ఉంటాయి.

**ఆర్ద్ర నక్షత్రం :** వైద్యకోర్సులను అభ్యసించేవారు, వైద్య వృత్తిలో ఉన్నవారు, వైద్య సంబంధిత వ్యాపారాలు నడిపేవారు మంచి అభివృద్ధిని వృత్తి పరంగా సాధించాలనుకుంటే ఆర్ద్ర నక్షత్రంతో కలిసిన శుక్రవారం ఉదయం 10.30 నుంచి 12.00 వరకు గల రాహుకాలంలోను అలాగే ఆర్ద్ర కలిసిన శనివారం ఉదయం 9.00 నుంచి 10.30 వరకు గల రాహుకాలంలో 5 ఎండు ఖర్జూరాలను ఆరగించండి. అరకప్పు చల్లని మంచి నీళ్లను త్రాగండి. వృత్తి పరంగా అభివృద్ధి లభించును. నియమాలు లేవు.

**పునర్వసు నక్షత్రం :** శనివారంతో కలిసిన పునర్వసు నక్షత్రం సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు ఉండి ఉంటే స్త్రీలకు విశేష శుభప్రదంగా స్వీకరించాలి. ఈరోజున స్త్రీలు మధ్యాహ్న భోజనం తదుపరి తప్పక తాంబూల సేవనం చేయండి. అంతేకాదండోయ్.. మరొక ముత్తైదువకు కూడా ఈ తాంబూలాన్ని ఇచ్చి... వారిచే కూడా తాంబూల సేవనం చేయించండి. మీ జాతకాలలోని కళత్ర దోషానికి తాంబూల సేవనం అడ్డుపడుతుంది.

**పుష్యమి నక్షత్రం :** శనివారంతో కలిసిన పుష్యమి నక్షత్రం సూర్యోదయం నుంచి సూర్యాస్తమం వరకు ఉండి ఉంటే... మధ్యాహ్నము కారం లేకుండా సాత్త్వికభోజనాన్ని మీగడ పెరుగుతో చేయండి. అష్టమ, అర్ధాష్టమ, ఏలినాటి శని సమయాలతో పాటు, శని మహాదశ జరిగే జాతకులు కూడా సాధించలేని పనిని సాధించుకొనటానికి అవకాశాలు రాకున్నప్పటికీ సమయస్ఫూర్తితో మాట్లాడి కార్యజయం చేకూర్చుకొనగలరు.

**ఆశ్లేష నక్షత్రం :** ఆశ్లేష నక్షత్రంతో కలిసిన సోమవారం నాటి రాహుకాలంలోను, అలాగే ఆశ్లేష సహిత శనివారం నాటి రాహుకాలంలో తైలమేదైనప్పటికీ 5 వత్తులతో దీపారాధన చేయండి. తూర్పుముఖంగా కూర్చుని కనీసం 12 నిముషాల పాటు వెలుగుతున్న 5 వత్తులని తదేకంగా చూస్తు మనసులో మీ ఇష్టదైవాన్ని ధ్యానించండి. పరోక్షంగా మీ సంతానంపై మంచి అభిప్రాయంతో మీ నిర్ణయాలు వస్తూ... కుటుంబ లబ్ధి చేకూరును.

**మఖ నక్షత్రం :** మంగళవారంతో కూడిన మఖ నక్షత్రంలో ఉదయం 9 గంటల నుంచి 10.30 నిముషాల మధ్యగల యమగండకాలంలో తీపి బెల్లాన్ని సూర్యకిరణాలు సోకేలా ఒక విస్తరిలో ఉంచండి. ఇంటిలో ఉన్న బెల్లాన్ని గాని లేక బజారు నుంచి తెచ్చిన బెల్లాన్ని గాని, ఈ 90 నిముషాల పాటు కిరణాలు సోకేలా ఉంచి తదుపరి గృహ అవసరాలకు వినియోగించండి. పిండివంటలకు లేక దేవతామూర్తులకు ఇచ్చే నివేదనలకై ఈ బెల్లాన్ని వినియోగించండి. దీని వలన పరోక్షంగా అనారోగ్య సమస్యలు తగ్గుముఖం పట్టును.

**పుబ్బ నక్షత్రం :** ఆది, శుక్రవారాలతో కలిసివచ్చిన పుబ్బ నక్షత్రం గల దినమున, శ్రీ లక్ష్మీదేవిని ఎరుపు పుష్పాలతో పూజించి కనకధారాస్తోత్రాన్ని పఠించి, బెల్లం పాయసాన్ని నివేదించండి. నివేదించిన పాయసాన్ని కుటుంబ సభ్యులందరూ ప్రసాదంగా స్వీకరించండి. ఈ విధంగా 40 సార్లు నక్షత్రస్థితి వచ్చినరోజులలో చేసినచో మహాలక్ష్మి దేవి గృహంలో స్థిరనివాసముండునని పురాతన తాళపత్ర గ్రంధాలు తెలియజేస్తున్నాయి. కనీసం 40 సార్లు అనగా శుక్రవారాలు, ఆదివారాలు కలపగానే వచ్చినవిగా భావించాలి. అంతేకానీ 40 శుక్రవారాలు, 40 ఆదివారాలు అని అర్ధం కాదు.



## మేషరాశి

శ్రీ మన్మథ : ఆదాయం:14, వ్యయం:14, రాజ్యపూజ్యం:3, అవమానం: 6

శ్రీ దుర్ముఖి : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:1, అవమానం: 7

**జనవరి:** మనోవాంఛలు ఆలస్యంగా నెరవేరును. ఋణదాతల వత్తిడి తగ్గును. ప్రధాన సమస్యలకు పరిష్కారాలు తెలుసుకుంటారు. కీళ్ల రుగ్మత రాగల అవకాశం ఉంది. సహచరులతో రాజీపడుదురు. స్తంభించిన కార్యం నెరవేరును. కార్యబాధ్యతలు సజావుగా సాగును. సంతానరీత్యా ఖర్చులు పెరుగును. భూగృహ మార్పులు అధికం. జనవరి 5 రా12.54 నుంచి 8 ఉదయం 9.48 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**ఫిబ్రవరి :** శుభకార్యానికి మార్గం సుగమం. స్పెక్యులేషన్ స్వల్ప రాణింపు. స్త్రీలకు శుభకరం. మాసం మధ్యలో శతృఅంశాలపై ఆరా. మాసాంతంలో సంజాయిషీలు, క్షమాపణలు. జాయింటు వ్యాపారాలు పురోగతి. వాగ్దానాల జోరును తగ్గిస్తారు. శాంత స్వభావంతో అనుకూలతలు లభించును. ఫిబ్రవరి 2 ఉదయం 9.38 నుంచి 4 రాత్రి 7.19 వరకు ప్రతికూలమని గమనించాలి.

**మార్చి :** బంధుప్రీతిలో లోపం గ్రహిస్తారు. గౌరవ ప్రతిష్ఠలకు భంగకరం. శరీరానికి వైద్యసేవలవసరం. ఋణభారం తగ్గును. 3వవారంలో ఖచ్చిత నిర్ణయాలచే లబ్ది పెరుగును. విహారయాత్రలచే ధన వ్యయముంది. న్యాయలావాదేవీలు అనుకూలము. పాతమిత్రత్వం కోరుకుంటారు. మాసాంతంలో వ్యతిరేక రోజులున్నాయని గ్రహించాలి. గత నెల 29 సాయంత్రం 5.36 నుంచి 2 ఉదయం 4.21 వరకు ప్రతికూలం.

**ఏప్రిల్ :** ఉద్యోగస్తులకు అధికారుల బెడద. ఇరుగుపొరుగుతో సత్సంబంధాలు మెరుగుపడతాయి. 2వవారంలో కృషికి తగిన ఫలితం పొందుతారు. తల్లిదండ్రుల ఆరోగ్య విషయంలో జాగ్రత్తలు తీసుకుంటారు. న్యాయస్థాన లావాదేవీలు వాయిదా పడును. దూరప్రాంత ప్రయాణాలలో స్వల్ప సమస్యలున్నాయని గమనించాలి. ఏప్రిల్ 24 ఉదయం 6.24 నుంచి 26 సాయంత్రం 5.54 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**మే :** శరీరతేజస్సు పెరుగును. నిరుద్యోగులకు శుభవార్తలు. తోబుట్టువులచే నమ్మక్రదోహముంది. దూరప్రయాణాలతో అలసట. ఉన్నత వ్యక్తుల పరిచయాలచే లబ్ధి. వాహన సౌఖ్యము ఏర్పడును. స్వయంవృత్తుల వారికి మాసాంతంలో ఆశాజనకం. 2,3 వారాలలో తీసుకునే హడావుడిగా నిర్ణయాలు తీసుకోవద్దు. మే 21 మధ్యాహ్నం 12.29 నుంచి 23 రాత్రి 11.37 వరకు అనుకూల సమయం కాదు.

**జూన్ :** ఆర్ధికవిషయాలలో పురోగమన దిశలో నడుస్తారు. 2 పక్షంలో వ్యాపార లావాదేవీలలో ఆచితూచి వ్యవహరించాలి. భూ, గృహ లావాదేవీలకు మార్గం సుగమం. కంఠం నుండి ఉదరం వరకు ఆరోగ్య లోపములున్నవి. విద్యార్థులకు ఆశాజనకం. ఆకస్మిక స్థానచలన సూచనలు. మాసాంతంలో పంతాలకు, పట్టింపులకు దూరంగా ఉండాలి. జూన్ 17 రాత్రి 7.17 నుంచి 20 ఉదయం 6.05 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**జూలై :** న్యాయస్థాన లావాదేవీలు కొంత మెరుగ్గా ఉంటాయి. 2వ వారంలో కుటుంబ కలహాలతో మనస్తాపం. నిర్మాణాత్మక కార్యక్రమాలలో లోపాలను గమనించలేరు. ఇతరులను ఆదర్శంగా తీసుకుని సమయస్ఫూర్తితో ముందుకు వెళతారు. సహోద్యోగులచే లబ్ధి. ఓ మిత్ర ద్రోహం జరుగు సూచన కలదు. అందుచే గురువారాలలో మధ్యాహ్న సమయంలో నిద్రించవద్దు. జూలై 14 రాత్రి 2.55 నుంచి 17 మధ్యాహ్నం 1.46 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**ఆగస్టు :** అవివాహితులకు శుభవార్తలు. సంతానంపై విమర్శలు తగ్గును. ఆడంబరాలకు వెళ్లటంతో ధనవ్యయం. సాధువులతో విరోధములుండును. కళారంగాల వారికి ఆశాజనకం. వృత్తి, ఉద్యోగాలలో నిఘా ఉంది. సోమరితన వ్యాప్తి హెచ్చు. భాగస్వామ్య వ్యాపారాలలో వ్యూహాత్మక నిర్ణయాలతో అనుకోని లబ్ధి. ఆగస్టు 11 మధ్యాహ్నం 11.01 నుంచి 13 రాత్రి 10.20 వరకు ప్రతికూలసమయం.

**సెప్టెంబరు :** నూతన ప్రయత్నాలు సఫలీకృతం. సమస్యలను సునాయా సంగా పరిష్కరించుకుంటారు. స్పెక్యులేషన్ యోగవంతం కాదు. శరీరానికి అలసట అధికం. అనవసర ప్రయాణాలతో ధనవ్యయం. మూడవవారంలో వ్యక్తిగత ప్రతిష్ఠలకు వెళ్లుదురు. శుభకార్య చర్చలు ఆశాజనకంగా నడుస్తాయి. సెప్టెంబరు 17 సాయంత్రం 6.53 నుంచి 10 ఉదయం 6.52 వరకు అనుకూల సమయం కాదు.

**అక్టోబరు :** ఆలోచనలకు పదును పెడుదురు. బంధుద్వేషాన్ని విడనాడ లేరు. మిత్రత్వ సంభాషణలు పెంపొందును. స్థానచలన అవకాశాలు హెచ్చు. ఋణదాతల వత్తిడి అధికం. సంతాన సమస్యలు తలెత్తిననూ, సమయస్ఫూర్తితో పరిష్కరిస్తారు. అక్టోబరు 4 రాత్రి 1.57 నుంచి 7 మధ్యాహ్నం 2.26 వరకు ప్రతికూలసమయం.

**నవంబరు :** జీవనసరళిపై అనుమానాలు పెంచుకుంటారు. మార్పులకై అన్వేషిస్తారు. ఇతరులపై కోపోద్రేకులవుదురు. సోదరసమన్వయంతో బలాన్ని పుంజుకుంటారు. స్పెక్యులేషన్ కొంతమేర లాభసాటి. అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగును. ప్రేమికుల మధ్య మనస్పర్ధలున్నవి. నవంబరు 1 ఉదయం 8.16 నుంచి 3 రాత్రి 8.47 వరకు తిరిగి 28 మధ్యాహ్నం 2.19 నుంచి 30 రాత్రి 2.37 వరకు వ్యతిరేక సమయాలుగా గ్రహించాలి.

**డిశంబరు :** దూరప్రయాణాలు అనుకూలిస్తాయి. క్రమశిక్షణకు, అంకిత భావానికి గుర్తింపు లభిస్తుంది. జాయింట్‌వ్యాపారుల మధ్య స్వల్ప సమస్య. ఆధ్యాత్మిక విషయాలలో పాల్గొనటంచే మనశ్శాంతి. సంతాన వినోద విహారా లకు అధిక వ్యయం. డిశంబరు 25 రాత్రి 8.52 నుంచి 28 ఉదయం 9.02 వరకు ప్రతికూల సమయం.

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ మన్మథ నామ సంవత్సర పుష్య బహుళ అష్టమి సోమవారం నుంచి మాఘ బహుళ షష్ఠి సోమవారం వరకు

## 2016 FEBRUARY ఫిబ్రవరి

2016 జనవరి 29 శుక్రవారం రాత్రి 11గం॥37ని॥ల నుంచి సింహరాశిలో రాహువు గురువుతో కలిసినందున గురుచండాల యోగం ప్రారంభమై, 2016 ఆగస్టు 11 వరకు ఉండును. ప్రతివారు భగవతారాధనం తప్పక చేయాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము:సా4.32-5.17<br>రా.కా: సా4.30-6.00 | ఫిబ్రవరి 8 సోమవారం శ్రవణా నక్షత్రంలో పుష్య అమావాస్య రాక విశేషం. దీనినే సోమవతీఅమావాస్య అంటారు. ఈనాడే మౌని అమావాస్య | **7**<br>బ.చతుర్దశి రా10.20<br>ఉత్తరాషాఢ సా6.30<br>వ.రా10.15-11.46 | **14**<br>శు.సప్తమి రా2.11<br>భరణి తె4.11<br>వ.మ2.36-4.07 | **21**<br>శు.చతుర్దశి రా10.34<br>ఆశ్లేష తె5.28<br>వ.సా5.35-7.17 | **28**<br>బ.పంచమి మ11.21<br>స్వాతి రా9.30<br>వ.రా3.46-5.33 |
| MON సోమ<br>దుర్ము:మ12.44-1.29<br>మ2.59-3.44<br>రా.కా:ఉ7.30-9.00 | **1**<br>బ.అష్టమి రా10.05<br>స్వాతి మ1.47<br>వ.రా7.58-9.44 | **8** ●<br>పుష్యఅమావాస్యరా8.09<br>శ్రవణం సా5.04<br>వ.రా8.46-10.14 | **15**<br>శు.అష్టమి రా12.27<br>కృత్తిక రా3.09<br>వ.మ3.40-5.12 | **22** ○<br>పూర్ణిమ రా11.50<br>మఘ పూర్తిగా<br>వ.సా6.25-8.09 | **29**<br>బ.షష్ఠి మ1.48<br>విశాఖ రా12.18<br>వ.తె4.41-6.27 |
| TUE మంగళ<br>దుర్ము:ఉ8.58-9.43<br>రా11.05-11.56<br>రా.కా: మ3.00-4.30 | **2**<br>బ.నవమి రా11.56<br>విశాఖ సా4.16<br>వ.రా8.35-10.18 | **9**<br>మాఘమాసప్రారంభం<br>శు.పాడ్యమి సా5.36<br>ధనిష్ఠ మ3.16<br>వ.రా9.52-11.20 | **16**<br>శు.నవమి రా11.04<br>రోహిణి రా2.30<br>వ.సా6.43-8.17 | **23**<br>బ.పాడ్యమి రా1.32<br>మఘ ఉ7.23<br>వ.సా4.09-5.55 | |
| WED బుధ<br>దుర్ము:మ11.59-12.44<br>రా.కా: మ12.00-1.30 | **3**<br>బ.దశమి రా1.06<br>అనూరాధ సా6.09<br>వ.రా12.01-1.42 | **10**<br>శు.విదియ మ2.52<br>శతభిషం మ1.16<br>వ.రా7.06-8.34 | **17**<br>శు.దశమి రా10.06<br>మృగశిర రా2.15<br>వ.ఉ8.03-9.38 | **24**<br>బ.విదియ రా3.39<br>పూర్వఫల్గుణి ఉ9.43<br>వ.సా5.43-7.30 | |
| THU గురు<br>దుర్ము:ఉ10.28-11.13<br>మ3.00-3.46<br>రా.కా:మ1.30-3.00 | **4**<br>బ.ఏకాదశి రా1.30<br>జ్యేష్ఠ రా7.19<br>వ.రా3.27-5.05 | **11**<br>శు.తదియ మ12.03<br>పూర్వాభాద్ర మ11.10<br>వ.రా7.57-9.25 | **18**<br>శు.ఏకాదశి రా9.33<br>ఆర్ద్ర రా2.24<br>వ.ఉ10.42-12.17 | **25**<br>బ.తదియ పూర్తిగా<br>ఉత్తర మ12.25<br>వ.రా9.51-11.39 | |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.57-9.43<br>మ12.44-1.30<br>రా.కా:ఉ10.30-12.00 | **5**<br>బ.ద్వాదశి రా1.08<br>మూల రా7.43<br>వ.సా6.06-7.43<br>వ.తె5.12 లగాయితు | **12**<br>శు.చవితి ఉ9.17<br>ఉత్తరాభాద్ర ఉ9.07<br>వ.రా8.10-9.39 | **19**<br>శు.ద్వాదశి రా9.26<br>పునర్వసు రా2.59<br>వ.మ2.42-4.20 | **26**<br>బ.తదియ ఉ6.05<br>హస్త మ3.22<br>వ.రా12.24-2.13 | |
| SAT శని<br>దుర్ము:ఉ6.41-8.12<br>రా.కా:ఉ9.00-10.30 | **6**<br>బ.త్రయోదశిరా12.03<br>పూర్వాషాఢ రా7.25<br>వ.శేషం ఉ6.47వరకు<br>వ.రా3.06-4.39 | **13**<br>శు.పంచమి ఉ6.40<br>శు.షష్ఠి తె4.17<br>రేవతి ఉ7.13అశ్వని తె5.33<br>వ.రా1.50-3.19 | **20**<br>శు.త్రయోదశి రా9.46<br>పుష్యమి తె4.00<br>వ.మ11.19-12.59 | **27**<br>బ.చవితి ఉ8.42<br>చిత్ర సా6.28<br>వ.రా12.47-2.35 | |

### పండుగలు

4 షట్‌తిలైకాదశి
6 శనిత్రయోదశి మాసశివరాత్రి
8 మౌనిఅమావాస్య
9 మాఘమాస చంద్రోదయం
10 జమాదీలవ్వల్ నెలారంభం
12 వసంతపంచమి (పూర్వాహ్ణవ్యాప్తి)
13.వరుణషష్ఠి కుంభసంక్రాంతి
14 రథసప్తమి వైవస్వతమన్వంతరాది
15 భీష్మాష్టమి
16 మధ్వనవమి
18 భీష్మఏకాదశి (జయ)
20 విశ్వకర్మజయంతి
22 మాఘపూర్ణిమ
26 సంకష్టహరచతుర్థి

### రథసప్తమి విశేషం

కుంభసంక్రమణ తొలినాటి తొలిలగ్నంలో అనగా ఫిబ్రవరి 14 ఆదివారం శుక్ల సప్తమి భరణి నక్షత్రంలో రథసప్తమి రావటం మహావిశేషం

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### ఫిబ్రవరి శుభసమయములు

| | |
|---|---|
| | శ్రీ మన్మథ పుష్యమాసము |
| 03 | బుధ బ.దశమి అనూరాధ మ12.45-2.19 |
| 04 | బుధ బ.ఏకాదశి మూల రా08.45-10.50 |
| | శ్రీ మన్మథ మాఘమాసము |
| 10 | బుధ శు.విదియ శతభిషం మ12.45-1.16 |
| 11 | గురు శు.చవితి ఉత్తరాభాద్ర మ12.04-1.47 |
| 11 | గురు శు.చవితి ఉత్తరాభాద్ర రా9.26-10.22 |
| 12 | శుక్ర శు.పంచమి రేవతి మ11.43-3.55 |
| 12 | శుక్ర శు.పంచమి రేవతి రా9.40-10.18 |
| 13 | శని శు.షష్ఠి అశ్వని మ11.39-3.51 |
| 17 | బుధ శు.దశమి మృగశిర మ12.46-3.35 |
| 17 | బుధ శు.దశమి మృగశిర రా7.54-9.58 |
| 19 | శుక్ర శు.ద్వాదశి పునర్వసు మ11.15-12.44 |
| 19 | శుక్ర శు.ద్వాదశి పునర్వసు రా7.46-9.50 |
| 20 | శని శు.త్రయోదశి పుష్యమి మ1.00-3.23 |
| 20 | శని శు.త్రయోదశి పుష్యమి రా7.42-9.46 |
| 22 | సోమ పూర్ణిమ మఘ ఉ7.47 -9.20 |
| 22 | సోమ పూర్ణిమ మఘ మ11.03-12.43 |
| 22 | సోమ పూర్ణిమ మఘ మ1.32-3.02 |
| 24 | బుధ బ.విదియ ఉత్తర ఉ10.55-11.57 |
| 24 | బుధ బ.విదియ ఉత్తర రా7.31-11.40 |
| 25 | గురు బ.విదియ ఉత్తర ఉ7.31-9.04 |
| 25 | గురు బ.తదియ ఉత్తర మ11.12-12.25 |
| 25 | గురు బ.తదియ హస్త రా7.22-9.50 |
| 26 | శుక్ర బ.చవితి హస్త ఉ7.27-8.50 |
| 26 | శుక్ర బ.చవితి హస్త ఉ10.47-మ12.43 |
| 26 | శుక్ర బ.చవితి చిత్ర రా7.18-11.32 |
| 27 | శని బ.పంచమి చిత్ర ఉ10.43-2.55 |
| 27 | శని బ.పంచమి చిత్ర రా7.14 -9.18 |
| 28 | ఆది బ.పంచమి స్వాతి ఉ10.43-మ11.21 |
| 28 | ఆది బ.షష్ఠి స్వాతి రా7.14-9.30 |

*Engagements*

## ఉసిరిక భస్మ ధారణతో అన్యోన్య దాంపత్యం

దంపతులలో చాలామంది జాతకాలు, నక్షత్రాలు కలవలేదని, మనస్పర్ధలు వస్తున్నాయని బాధపడుతుంటారు. మద్యపానం, జూదంతో ఉంటున్న వారి మధ్య మనస్పర్ధలు వస్తుంటాయి. ఇట్టివారికి పరిహారమే ఉసిరిక భస్మ ధారణము. దీనిని భార్యాభర్తలిరువురూ విధిగా ఆచరించాలి.

ఉసిరికలు లభించే కాలంలో ఆరుద్ర నక్షత్ర రోజును ప్రధానంగా తీసుకోవాలి. ఉదయం నుంచి సాయంకాలం వరకు ఆరుద్ర నక్షత్రం ఉండాల్సిన అవసరం లేదు. కేవలం ఆరుద్రా నక్షత్రమున్న పగటిసమయంలో,సుమారు అరకేజి ఉసిరికలను ముక్కలు చేయండి. విత్తనాలు ఏరివేయండి. వాటిని ఎండబెట్టండి. బాగా ఎండిన ఉసిరికి వరుగును డబ్బాలో భద్రపరచండి. ఇక చేయవలసినది ఏమంటే... సూర్యగ్రహణం, చంద్రగ్రహణం పాక్షికంగా లేక సంపూర్ణంగా కనపడితే చాలు. భారతదేశంలో సూర్యచంద్రగ్రహణాలు కనపడక పోయిననూ, ఇబ్బంది లేదు. భారత్ కాక ఇతరదేశాలలో సూర్యచంద్రగ్రహణాలు జరిగిననూ అవసరమే.

మనదేశంలో గ్రహణాలుంటే, ఆసమయాలు పంచాంగాలలో వ్రాస్తారు. ఇతరదేశాలలో అయితే భారతకాలమాన ప్రకారం ఏ సమయంలో గ్రహణాలు జరుగుతున్నాయో ఆ సమయాన్ని మాత్రం తెలుసుకోండి. భారతదేశం లేక ఇతర దేశాలలో సూర్య చంద్రగ్రహణాలు జరిగే సమయంలో... ఉసిరికి వరుగును ఒకచోట ఉంచి.. దానిపై మరింత కర్పూరపొడిని చల్లి మండించండి. బాగా కాలి బూడిద అవుతుంది. ఇలా వచ్చిన భస్మాన్ని భద్రపరుచుకోండి.

భస్మం తయారైన రోజునుంచి, 27 వారాల వరకు మాత్రమే ఉపయోగించవచ్చును. తదుపరి... అది ప్రభావాన్ని కోల్పోవును. బాధలనుభవించే దంపతులు, గ్రహణ సమయాలలోనే, భస్మాన్ని చేసుకుని మరునాటి నుంచి నిత్యం ఉదయ లేక సాయంత్రాలలో దంపతులిరువురూ కంఠము నందు మాత్రమే విభూతిలా భస్మాన్ని ధరించాలి. నుదుటునవసరం లేదు.

భస్మాన్ని 27 వారాలవరకు ధరిస్తూ ఉండవచ్చు. తిరిగి ఆరుద్ర సమయంలో ఉసిరికలను ముక్కలు చేసి, ఎండించి, గ్రహణాల సమయంలో భస్మం చేయండి. దంపతులలో ఎవరైననూ ముక్కలు చేయవచ్చు, భస్మం చేయవచ్చు. ధరించాల్సింది మాత్రం ఇరువురూ.

భస్మానికి కాలవ్యవధి 27 వారాలే. దంపతుల అన్యోన్యతకు ఈ ఉసిరిక భస్మధారణను ఎంత కాలమైనా వాడవచ్చును. కాలపరిమితి లేదు. స్త్రీల ఋతుసమయంలో... ఇరువురూ ఉసిరిక భస్మాన్ని ధరించవద్దు. ఈమధ్యకాలంలో ఈ భస్మం కొంతమంది తయారుచేసి అమ్ముతున్నట్లుగా వార్తలు వచ్చాయి. వాటిని కొనవద్దు. మీరు స్వయంగా చేసుకోండి.

## 27 నక్షత్రాలలో చేయదగిన విశేష పరిహారములు

**ఉత్తర నక్షత్రం :** ఆది, గురువారాలలో ఉత్తర నక్షత్రం వచ్చినట్లయితే మర ఆడించిన గోధుమపిండిలో ఉప్పు వేసి, నీటితో చపాతీ పిండిలా కలపాలి. ఈ పిండితో రొట్టెలుగా చేసి నూనె లేకుండా కాల్చాలి. నక్షత్రం మాత్రం ఉదయం నుంచి రాత్రి 7గంటల వరకు ఉండి తీరాలి. ఇలా కాల్చిన రొట్టెలను యాచకులకు గానీ, గోమాతకు గానీ సమర్పించండి. ఇందుచే సూర్యగ్రహ అనుగ్రహం సంప్రాప్తించును.

**హస్త నక్షత్రం :** హస్త నక్షత్రం కలిసిన సోమ, శుక్రవారాలు గానీ లేదా హస్త నక్షత్రంతో కూడిన చైత్రమాస పూర్ణిమ రోజున గానీ శ్రీమహాగణపతిని షోడశోపచారాలతో పూజించి ఉండ్రాళ్లను నివేదించండి. ఈ ఉండ్రాళ్లను మధ్యాహ్నంలోగానే ప్రసాదంగా స్వీకరించండి. మధ్యాహ్నం తదుపరి ఎట్టి పరిస్థితులలో నిద్రపోవద్దు. ఇలా చేసినందున చేపట్టే కార్యక్రమాలకు విఘ్నాలు తొలగునని పురాతన తాళపత్ర గ్రంధాలు పేర్కొన్నాయి.

**చిత్ర నక్షత్రం :** ఆదివారం రోజులలో చిత్ర నక్షత్రం ఉదయం నుంచి సాయంత్రం ఏడు గంటల వరకు ఉండితీరాలి. వాహనయోగం కావాలనుకునే వారు, వాహన ప్రమాదాలు జరగకుండా ఉండాలనుకునే వారు ప్రమాదాల నివారణ కొరకై, సమీపంలో ఉన్న గణపతి ఆలయానికి వెళ్లి సాయంత్రం నుంచి ఆలయద్వారాలు మూసివేసే లోపల స్వామిని దర్శించి, ఘంటానాదం చేయండి. తదుపరి ఆలయంలో మౌనంగా కనీసం 5 నిముషాల పాటు ప్రార్ధనాపూర్వకంగా మరోసారి స్వామిని ధ్యానించండి.

**స్వాతి నక్షత్రం :** స్వాతి నక్షత్రంతో కూడిన బుధవారం నాటి రాహుకాల సమయంలో అనగా మధ్యాహ్నం 12 గంటల నుంచి 1.30నిముషాల మధ్య కాలంలో మాత్రమే తొక్క తీసిన యాలక్కాయ గింజలను నాలుక దిగువన ఉంచుకోవాలి. రాహుకాలం ముగియగానే ఈ గింజలను నమిలి మంచినీరు త్రాగేది. ఈ మధ్యకాలంలో కాఫీ, టీలు త్రాగవద్దు. ఇతర పదార్ధాలు తినవ్రద్దు. నీరు త్రాగవచ్చును. ఇలా చేస్తున్నందున అనవసర శతృత్వాలు తగ్గుముఖం పట్టును. పరస్పర నిందారోపణలు ఉండవు.

**విశాఖ నక్షత్రం :** విశాఖ నక్షత్రం సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు ఉన్నటువంటి సోమవారం గానీ, శుక్రవారమున గానీ, ఏదో ఒక తీపిపదార్ధాన్ని మీ ప్రియ మిత్రునకు ఇవ్వండి. ఇలా చేసినందున మిత్రుల నుంచి మిత్రద్రోహం జరగకుండా ఉండును. అలాగే ఆ మిత్రుల నుంచి మీరు కూడా తీపిపదార్ధాన్ని తిన్నట్లయితే మీ మిత్ర బంధం మరింత ధృడపడును. అయితే తీపి పదార్ధాన్ని ఇరువురు వెళ్లి కొనుగోలు చేయటం సర్వదా శ్రేయస్కరం. ఇలా కొనుగోలు చేసినందున నమ్మకమే మిత్రత్వాన్ని పెంచును.

**అనూరాధ నక్షత్రం :** అనూరాధ నక్షత్రం బుధవారం నాడు సూర్యోదయం నుంచి సూర్యాస్తమం దాకా ఉన్నరోజున పచ్చపెసలు ఒక పిడికెడు, నల్ల నువ్వులు ఒక పిడికెడు తీసుకుని నల్లటి గుడ్డలో మూటకట్టి సింహద్వారానికి కట్టాలి. సూర్యాస్తమయం తదుపరి మూటను తీసి దూరంగా వెళ్లి విసర్జించాలి. ఇలా చేయటం వలన అద్దె ఇళ్లలో నివసించే వారికి లేక అద్దెకు తీసుకున్న షాపులు లేక ఆఫీసులలో వాస్తుదోషాలు ఉన్నచో తొలగును.

**జ్యేష్ఠ నక్షత్రం :** సోమవారము లేక గురువారం నాడు సూర్యోదయం తదుపరి 5 ఘుడియలు లేక 120 నిముషాలు తక్కువ కాకుండా జ్యేష్ఠ నక్షత్రం వచ్చినట్లయితే, ఆనాడు సాధారణ స్నానంచేసి, మీరు వాడుకునే అద్దమును (దర్పణము) తీసుకుని ఇంటి బయటకు వెళ్లి, కనులు మూసుకుని మనసులోనే శ్రీ సూర్యనారాయణ స్వామిని నమస్కరించుకుని, ఆతర్వాత అద్దంలో మీ ప్రతిబింబాన్ని తదేకంగా ఓ అరనిముషం పాటు వీక్షించండి. ఇలా చేసినందున మీకు తెలియకుండానే మీలో ఓ సరిక్రొత్త నూతన ఉత్సాహం ప్రారంభమగును. ఆ సమయంలో మీరు సూర్యకిరణాలు పడే స్థలంలోనే ఉండితీరాలి.

**మూల నక్షత్రం :** సోమ, మంగళ, బుధ, గురువారాలు కలిసిన మూల నక్షత్ర యమగండ కాల సమయంలో తేనెతో కలిపిన సరస్వతి చూర్ణమును కొద్దిగా కుడి అరచేతిలో వేసుకుని, ఉత్తర దిశగా నిలబడి కనులు మూసుకోవాలి. నాలుకను 30 సెకన్లపాటు నోటి నుంచి బయటకి చాపాలి. 30 సెకన్లు తదుపరి కనులు తెరవకుండానే తేనె కలిపిన సరస్వతీ చూర్ణాన్ని స్వీకరించాలి. తదుపరి కనులు తెరవాలి. ఇలా చేసే సమయంలో యమగండ కాలం ఉండితీరాలి. తద్వారా విద్యాస్థానం బలీయంగా ఉండును.

**పూర్వాషాఢ నక్షత్రం :** బుధ, శనివారాలతో కలిసిన పూర్వాషాఢ నక్షత్ర రోజులలో మధ్యాహ్న భోజనానికి ముందు తీపిపదార్ధాన్ని, భోజనంలో చివరన పెరుగును భుజించాలి. మధ్యాహ్నం ఎట్టి పరిస్థితులలో నిద్రపోకుండా మేల్కొని దినచర్య చేసుకునే వారలకు శుక్రగ్రహ అనుగ్రహం త్వరితగతిన రాగల సూచన కలదు. దీని వలన అనవసర ఖర్చులు తగ్గటమే కాక సమయానుకూలంగా బుద్ధిబలంతో రాణించగలుగుతారు.

**ఉత్తరాషాఢ నక్షత్రం :** క్షుద్రశక్తులు ఆపాదించాయని భయపడేవారు ఉత్తరాయణంలోని 6మాసాలలో కనీసం రెండుసార్లు ఉత్తరాషాఢ నక్షత్రం రోజున రాహుకాల సమయంలో నానిన గోధుమలను పిడికెడు గోమాతకు భక్తి విశ్వాసాలతో సమర్పించండి. ఈ గోధుమలను ముందురోజు నానబెట్టండి. నక్షత్రమున్ననాటి రాహుకాల సమయాన్నే తీసుకోవాలి. ఆ సమయంలో గోవు ముందు ఉంచండి. గోవు వాటిని తిన్ననూ, తినకపోయినూ సమస్య ఏమీ లేదు. కానీ ఆ రాహుకాల సమయంలో గోదర్శనం చేసుకుని తోకభాగాన్ని చేతులతో స్పర్శిస్తే, మీ మనసులో వ్యాప్తి చెందిన క్షుద్రశక్తి ప్రభావం తొలగును.



## వృషభరాశి

శ్రీ మన్మధ : ఆదాయం:8, వ్యయం:8, రాజ్యపూజ్యం:6, అవమానం: 6

శ్రీ దుర్ముఖి : ఆదాయం:11, వ్యయం:4, రాజ్యపూజ్యం:4, అవమానం:7

**జనవరి :** ఒప్పందాలు ఆలస్యంగా లాభిస్తాయి. నిస్వార్ధంగా ధనాన్ని అందిస్తారు. రానిబాకీలు వసూలగును.స్పెక్యులేషన్ రాణింపు. సంతాన ప్రయత్నాలు నెరవేరును. ఋణదాతల నుంచి మంచి నిర్ణయాలుండును. చివరి వారంలో వాగ్ధోరణిని అదుపులో ఉంచుకోవాలి. రెండవపక్షంలో అనవసర కాలయాపన చేసే వ్యక్తులకు దూరంగా ఉండాలి. జనవరి 8 ఉదయం 9.48 నుంచి 10 మధ్యాహ్నం 3.31 వరకు అనుకూలం కాదు.

**ఫిబ్రవరి :** మాతృవర్గీయులతో పట్టింపులధికం. వివాహ శుభ వార్తలుండును. వృత్తి ఉద్యోగ వ్యాపారాలలో 2వ పక్షంలో ఆశాభంగములు ఉన్నవి. వ్యూహాత్మక నిర్ణయాలకు పదునెడుదురు. పరోక్షంగా వృత్తి రీత్యా లబ్ధి కల్గుననే సంకేతాలు ఇచ్చే వ్యక్తులను త్వరపడి నమ్మవద్దు. ఫిబ్రవరి 4 రాత్రి 7.19 నుంచి 6 అర్ధరాత్రి 1.13 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**మార్చి :** వ్యతిరేకతలను గమనించి పావులు కదుపుతారు. ప్రతిష్ఠ పెంచుకుంటారు. లౌక్యంతో రాజీమార్గంలో నడుస్తారు. పూర్ణ లబ్దిని స్వీకరిస్తారు. స్పెక్యులేషన్ లాభం కాదు. అనవసర హామీలు వద్దు. అభివృద్ధి అంశాలపై దృష్టి ఉంచుతారు. సంకల్పబలంతో శుభకార్య చర్చలవైపు పావులు కదుపుదురు. మార్చి 2 ఉదయం 4.21 నుంచి 5 మధ్యాహ్నం 11.23 వరకు ప్రతికూల సమయము.

**ఏప్రిల్ :** పితృవర్గీయల సలహాలచే నూతన కార్యాలలో విజయం. చర్మ సంబంధ రుగ్మత రాగల సూచన. మనసు తరచుగా స్థిరత్వమును తప్పును. చివరివారంలో కళత్ర విభేదములున్నవి. వాగ్ధోరణిని అదుపులో ఉంచలేరు. కళాకారులకు ప్రోత్సాహకరం. మనో సంకటాలు సడలును. ముంజేతి సమస్య రాగల అవకాశముంది. ఏప్రిల్ 26 సాయంత్రం 5.54 నుంచి 28 రాత్రి 3.14 వరకు ప్రతికూల సమయం.

**మే :** గృహనిర్మాణాది పనులలో ఆటంకాలు. సమయస్ఫూర్తికి ప్రాధాన్యత ఉండును. పట్టుదలకు పోయినందున ఆర్ధికనష్టం. సోదరవ్యవహారాలు సానుకూలం కావు. స్త్రీలకు దీర్ఘకాల సమస్య తగ్గును. ఓర్పుకు ప్రాధాన్యత ఇవ్వవలిసి ఉండును. మాసాంతంలో సామరస్య పూర్వక వాతావరణం. మే 23 రాత్రి 11.37 నుంచి 26 ఉదయం 8.51 వరకు అనుకూలం కాదు.

**జూన్ :** ఆశాజనక పరిస్థితులతో సంఘంలో పేరు ప్రతిష్ఠలను పొందుతారు. వాహన సంబంధంగా జాగ్రత్తలు తీసుకొనాలి. శతృవర్గీయుల బెడద ఉంటుంది. సాహసోపేతమైన కార్యాలపై దృష్టి ఉంచుతారు. మాసాంతంలో అనవసర ధనక్షయం. జూన్ 20 ఉదయం 6.05 నుంచి 22 మధ్యాహ్నం 2.40 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**జూలై :** దూరబంధువుచే అనుకోకుండా సాయం పొందుదురు. ఉదర సంబంధ లోపంతో ముఖ్యకార్యాలు వాయిదా. స్పెక్యులేషన్ ఆశాజనకం. మిత్ర శతృత్వములు గమనించి మసులుకుంటారు. దంపతుల మధ్య అన్యోన్యత పెరుగును. ముఖ్య విషయాలలో శీఘ్రనిర్ణయాలు తీసుకొందురు. అవివాహితులకు వివాహయోగం. జూలై 17 మధ్యాహ్నం 1.46 నుంచి 19 రాత్రి 9.52 వరకు వ్యతిరేక సమయం.

**ఆగస్టు :** ఆర్థికంగా వెసలుబాటు లభించును. స్వయంవృత్తుల వారు కఠిన పరిశ్రమతో లబ్ధి. నేత్ర సమస్య తొలగును. మృదు సంభాషణలతో ఇతరులను ఆకట్టుకుంటారు. గృహంలో శుభకర వాతావరణం. భాగస్వామ్య ఒప్పందాలలో 3వ వారంలో కొన్ని సమస్యలుండును. ధైర్య సాహసాలు తగ్గిననూ దీర్ఘాలోచనలు పెరుగును. ఆగస్టు 13 రాత్రి 10.20 నుంచి 16 ఉదయం 6.36 వరకు అనుకూల సమయం కాదు.

**సెప్టెంబరు :** మానసిక వత్తిడి పెరుగును. స్వయంవృత్తుల వారికి ప్రోత్సా హకరం. 2వవారంలో అనుకున్న పనులు సాఫల్యతనొందును. ఉద్యోగస్థులపై నిఘా ఉన్నది. పిత్రార్జిత విషయాలలో సోదరుల మధ్య వివాదాలున్నవి. విశేష వ్యక్తుల పరిచయాలు పెరుగును. సెప్టెంబరు 10 ఉదయం 6.52 నుంచి 12 సాయంత్రం 4.03 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహించాలి.

**అక్టోబరు :** ఉద్యోగ వ్యాపార రంగాలలో ఆటంకాలు తొలగును. మానసిక ఆనందము అతిశయించును. నూతన వాహనకొనుగోలుకు అవకాశముంది. కుటుంబసభ్యులకు అనారోగ్యంచే వైద్యసహాయం తీసుకుందురు. మాసాంతంలో అన్నీ రంగాలలో అప్రమత్తత అవసరం. రాజకీయ వర్గీయులకు వ్యతిరేకములు కలవు. అభివృద్ధి అంశాలపై మూడవవారంలో దృష్టి ఉంచాలి. అక్టోబరు 7 మధ్యాహ్నం 2.26 నుంచి 9 రాత్రి 12.50 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.

**నవంబరు :** ఆలస్యంగానైనా గృహలావాదేవీలలో విజయం. వివాహం కాని వారికి వివాహయోగం. కళత్రభోగం పరిఢవిల్లును.ఎదుటివారిపై కోప తాపాలకు వెళ్లిన కారణంగా స్వల్ప అశాంతి. దూరప్రాంత ప్రయాణాలలో ప్రతికూలతలు. తొందరపాటు నిర్ణయాలను వాయిదా వేయాలి. 3 రాత్రి 8.47 నుంచి 6 ఉ7.58 వరకు ముఖ్యఅంశాలకు ప్రాధాన్యత ఇవ్వవద్దు.

**డిశంబరు :** భాగస్వామ్య ఒడంబడిక లోపాలను వెంటనే సవరించు కోవాలి. వాక్ ధోరణిని అదుపులో ఉంచుకోవాలి. ఒకముఖ్య వ్యక్తికి గృహంలో పెద్దపీట వేయుదురు. సంతానరీత్యా విజయపంథాలో ఉంటారు. శరీర తేజస్సులో మెరుగుదల ఉంటుంది. గతనెల 30 రాత్రి 2.37 నుంచి డిశంబరు 3 మధ్యాహ్నం 1.44 వరకు తిరిగి 28 ఉదయం 9.02 నుంచి 30 రాత్రి 7.36 వరకు అనుకూల సమయం కాదని భావించాలి.

PRANATHI TV నిత్యప్రవచకులు...

# కాలచక్రం

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

First Free e - books Android App

కాలచక్రం పంచాంగకర్త
జ్యోతిర్విజ్ఞాన విభూషణ బిరుదాంకిత
పండిత శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ



దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ మన్మథ నామ సంవత్సర మాఘ బహుళ సప్తమి మంగళవారం నుంచి ఫాల్గుణమాస బహుళ సప్తమి గురువారం వరకు

# 2016 MARCH మార్చి

2016 మార్చి 9 పూర్వాభాద్ర నక్షత్ర మీనరాశిలో కేతుగ్రస్త సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించును. ఖగోళంలో సంపూర్ణ గ్రహణం సంభవించినను భారతదేశంలో మాత్రం పాక్షికంగానే సూర్యగ్రహణం కనపడును.

**పండుగలు**

5 విజయేకాదశి
7 మహాశివరాత్రి
10 ఫాల్గుణచంద్రోదయం
11 జమాదీసానినెలారంభం
12 పుత్రగణపతి వ్రతం
13 శ్రీకంఠజయంతి
14 మీనసంక్రాంతి
19 అమలకి ఏకాదశి
20 శ్రీనృసింహద్వాదశి
22 కామదహనం
23 హెూళీ
23 మదనపూర్ణిమ

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము:సా4.38-5.25<br>రా.కా: సా4.30-6.00 | | **6**<br>బ.ద్వాదశి మ3.36<br>శ్రవణం రా3.43<br>వ.ఉ8.46-10.17 | **13**<br>శు.పంచమి మ3.16<br>భరణి మ11.08<br>వ.రా10.18-11.47 | **20**<br>శు.ద్వాదశి మ11.32<br>ఆశ్లేష మ11.35<br>వ.రా12.41-2.26 | **27**<br>బ.చవితి రా3.34<br>విశాఖ పూర్తిగా<br>వ.ఉ10.29-12.17 |
| **MON సోమ**<br>దుర్ము:మ12.42-1.29<br>మ3.04-3.51<br>రా.కా:ఉ7.30-9.00 | | **7**<br>బ.త్రయోదశి మ1.21<br>ధనిష్ఠ రా1.53<br>వ.ఉ7.25-8.53 | **14**<br>శు.షష్ఠి మ12.57<br>కృత్తిక ఉ9.27<br>వ.రా12.42-2.14 | **21**<br>శు.త్రయోదశిమ1.12<br>మఘ మ1.47<br>వ.రా10.38-12.24 | **28**<br>బ.పంచమి తె5.41<br>విశాఖ ఉ7.06<br>వ.మ11.32-1.18 |
| **TUE మంగళ**<br>దుర్ము:ఉ8.49-9.36<br>రా11.06-11.55<br>రా.కా: మ3.00-4.30 | **1**<br>బ.సప్తమి మ3.51<br>అనూరాధ రా2.38<br>వర్జ్యం లేదు | **8**<br>బ.చతుర్దశి ఉ10.34<br>శతభిషం రా11.36<br>వ.ఉ8.24-9.51<br>వ.తె5.19 లగాయితు | **15**<br>శు.సప్తమి మ11.12<br>రోహిణి ఉ8.19<br>వ.మ1.48-3.22 | **22**<br>శు.చతుర్దశి మ3.13<br>పూర్వఫల్గుణిసా4.19<br>వ.రా12.22-2.09 | **29**<br>బ.షష్ఠి పూర్తిగా<br>అనూరాధ ఉ9.41<br>వ.మ3.47-5.32 |
| **WED బుధ**<br>దుర్ము:మ11.56-12.43<br>రా.కా:<br>మ12.00-1.30 | **2**<br>బ.అష్టమి సా5.20<br>జ్యేష్ఠ తె4.21<br>వ.ఉ8.38-10.21 | **● 9**<br>మాఘ<br>అమావాస్య ఉ7.24, ఫాల్గుణ<br>శు.1మి తె4.01, పూర్వాభాద్ర<br>రా9.02, వ.శేషంఉ6.45<br>తె5.34 లగాయితు | **16**<br>శు.అష్టమి ఉ10.03<br>మృగశిర ఉ7.47<br>వ.సా4.13-5.49 | **23**<br>○ పూర్ణిమ సా5.31<br>ఉత్తర రా7.08<br>వ.తె4.35 లగాయితు | **30**<br>బ.షష్ఠి ఉ7.22<br>జ్యేష్ఠ మ11.50<br>వ.రా8.21-10.03 |
| **THU గురు**<br>దుర్ము:ఉ10.22-11.09<br>మ3.04-3.51<br>రా.కా:మ1.30-3.00 | **3**<br>బ.నవమి సా6.05<br>మూల తె5.20<br>వ.మ12.41-2.21<br>వ.రా3.40-5.20 | **10**<br>శు.విదియ రా12.34<br>ఉత్తరాభాద్రసా6.21<br>వ.ఉ6.59 వరకు<br>వ.తె5.02 లగాయితు | **17**<br>శు.నవమి ఉ9.32<br>ఆర్ద్ర ఉ7.52<br>వ.రా8.13-9.52 | **24**<br>బ.పాడ్యమి రా8.00<br>హస్త రా10.07<br>వ.శేషం ఉ6.22వరకు | **31**<br>బ.సప్తమి ఉ8.28<br>మూల మ1.24<br>వ.మ11.42-1.24<br>వ.రా11.21-1.01 |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.48-9.35<br>మ12.43-1.30<br>రా.కా:ఉ10.30-12.00 | **4**<br>బ.దశమి సా6.02<br>పూర్వాషాఢ తె5.32<br>వ.మ3.01-4.38 | **11**<br>శు.తదియ రా9.12<br>రేవతి మ3.42<br>వ.ఉ6.27 వరకు | **18**<br>శు.దశమి ఉ9.38<br>పునర్వసు ఉ8.34<br>వ.సా4.59-6.40 | **25**<br>బ.విదియ రా10.35<br>చిత్ర రా1.11<br>వ.ఉ7.08-8.57 | శ్రీమహాలక్ష్మి జన్మదినం<br>24 వసంతోత్సవం<br>25 గుడ్‌ఫ్రైడే<br>27 సంకష్టహరచతుర్థి |
| **SAT శని**<br>దుర్ము:ఉ6.26-8.00<br>రా.కా:ఉ9.00-10.30 | **5**<br>బ.ఏకాదశి సా5.11<br>ఉత్తరాషాఢ తె4.59<br>వ.మ1.21-2.55 | **12**<br>శు.చవితి సా6.03<br>అశ్వని మ1.15<br>వ.ఉ9.40-11.06<br>వ.రా10.00-11.28 | **19**<br>శు.ఏకాదశి ఉ10.20<br>పుష్యమి ఉ9.49<br>వ.రా11.34-1.17 | **26**<br>బ.తదియ రా1.09<br>స్వాతి తె4.13<br>వ.ఉ7.29-9.18 | సంపూర్ణ సూర్యగ్రహణం<br>భారతదేశంలోని అన్ని ప్రాంతాలలో సూర్యగ్రహణం పాక్షికం. సుమిత్రా దీవులు పరిసర ప్రాంతాలలోనే సంపూర్ణ సూర్యగ్రహణం కనపడును. |

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## మార్చి శుభసమయములు

**శ్రీ మన్మథ మాఘమాసము**

| | | |
|---|---|---|
| 03 | గురు | బ.నవమి మూల ఉ7.03-8.36 |
| 03 | గురు | బ.దశమి మూల సా6.54-11.08 |
| 05 | శని | బ.ఏకాదశి ఉత్తరాషాఢ ఉ8.01-8.28 |
| 05 | శని | బ.ఏకాదశి ఉత్తరాషాఢ మ2.56-సా4.39 |

**శ్రీ మన్మథ ఫాల్గుణమాసము**

| | | |
|---|---|---|
| 10 | గురు | శు.విదియ ఉత్తరాభాద్ర ఉ7.00 -8.08 |
| 10 | గురు | శు.విదియ ఉ.భాద్ర మ11.56-2.07 |
| 10 | గురు | శు.విదియ రేవతి సా6.26-రా10.40 |
| 11 | శుక్ర | శు.తదియ రేవతి ఉ6.31-8.04 |
| 11 | శుక్ర | శు.తదియ రేవతి మ11.52-12.40 |
| 11 | శుక్ర | శు.తదియ అశ్వని రా8.27-9.12 |
| 12 | శని | శు.చవితి అశ్వని మ11.48-1.59 |
| 14 | సోమ | శు.షష్ఠి రోహిణి మ11.40-12.40 |
| 14 | సోమ | శు.సప్తమి రోహిణి సా6.10-8.14 |
| 17 | గురు | శు.దశమి పునర్వసు మ11.28-3.02 |
| 17 | గురు | శు.దశమి పునర్వసు సా5.58-రా8.12 |
| 18 | శుక్ర | శు.ఏకాదశి పుష్యమి మ11.24-12.38 |
| 18 | శుక్ర | శు.ఏకాదశి పుష్యమి సా6.41-రా10.08 |
| 20 | ఆది | శు.త్రయోదశి మఘ మ11.36-3.39 |
| 20 | ఆది | శు.త్రయోదశి మఘ సా5.46-రా10.00 |
| 21 | సోమ | శు.త్రయోదశి మఘ మ11.12-12.38 |
| 23 | బుధ | పూర్ణిమ ఉత్తర మ11.04-11.49 |
| 23 | బుధ | బ.పాడ్యమి ఉత్తర సా5.34-రా7.08 |
| 23 | బుధ | బ.పాడ్యమి హస్త రా7.39-9.48 |
| 24 | గురు | బ.పాడ్యమి హస్త మ11.02-3.02 |
| 24 | గురు | బ.పాడ్యమి హస్త సా5.30-రా7.34 |
| 24 | గురు | బ.విదియ హస్త రా8.01-9.44 |
| 25 | శుక్ర | బ.విదియ చిత్ర ఉ10.56-మ12.37 |
| 25 | శుక్ర | బ.విదియ చిత్ర మ1.27-3.19 |
| 25 | శుక్ర | బ.విదియ చిత్ర సా5.26-రా9.40 |
| 26 | శని | బ.తదియ స్వాతి ఉ10.52-మ3.15 |
| 26 | శని | బ.తదియ స్వాతి సా5.22-రా9.36 |
| 28 | సోమ | బ.పంచమి అనూరాధ ఉ10.44-11.31 |
| 28 | సోమ | బ.పంచమి అనూరాధ సా5.14-రా9.28 |
| 30 | బుధ | బ.సప్తమి మూల మ12.48-2.59 |
| 30 | బుధ | బ.సప్తమి మూల సా5.06-8.20 |
| 31 | గురు | బ.అష్టమి మూల ఉ10.32-11.41 |

*Engagements*

## మార్చి 9న సంపూర్ణ సూర్యగ్రహణం

శ్రీ మన్మథ మాఘ అమావాస్య బుధవారం 9 మార్చి 2016 పూర్వాభాద్ర నక్షత్ర మీనరాశిలో కేతుగ్రస్త సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించును. భారతదేశంలో వివిధ ప్రాంతాల సూర్యోదయాల ముందునుంచే గ్రహణం ప్రారంభమై, సూర్యోదయాల తదుపరి కొద్ది నిముషాలు మాత్రమే పాక్షిక సూర్యగ్రహణముండును. సంపూర్ణ గ్రహణం భారతదేశంలో కనపడదు.

**భారతకాలమాన ప్రకారం సూర్యగ్రహణ సమయాలు**

| | |
|---|---|
| పాక్షికంతో సూర్యగ్రహణ స్పర్శ | - ఉ5గం॥46ని॥లు |
| సంపూర్ణ గ్రహణానికి రాక (ఉన్మీలనము) | - ఉ7గం॥25ని॥లు |
| గ్రహణ మధ్యకాలము | - ఉ7గం॥27ని॥లు |
| సంపూర్ణం నుంచి విడుపు ప్రారంభం(నిమీలనము) | - ఉ7గం॥29ని॥లు |
| పాక్షికంతో గ్రహణ ముగింపు (మోక్షం) | - ఉ9గం॥08ని॥లు |
| పూర్తి గ్రహణకాలము | - 3గం॥22ని॥లు |
| సంపూర్ణగ్రహణ బింబసమయం | - 4ని॥9సెకన్లు |

సూర్యగ్రహణం ఉదయం 9గం॥08ని॥లతో ముగియును. ఈ సమయం వరకు భారతదేశంలో సూర్యుడు కనపడుతూనే ఉంటాడు. కానీ గ్రహణము సూర్యునికి ఆవలివైపున జరుగుతూనే ఉంటుంది. సూర్యోదయం తదుపరి కొద్ది నిముషాలు పాక్షికంగా గ్రహణం కనపడి, తదుపరి కనపడదు. కానీ గ్రహణం పూర్తయిందని అనుకోవద్దు. మోక్షకాలం వరకు సూర్యుడు గ్రహణ బాధతోనే ఉంటాడు గనుక గర్భవతులు మోక్షం వరకు సూర్యవీక్షణ తగదు. సుమిత్రా దీవులలోనే సంపూర్ణబింబం గోచరించును. పూణె, బొంబాయి, అహ్మదాబాద్ ప్రాంతాలలో కనపడదు.

| | | | |
|---|---|---|---|
| తిరుమల | ఉ6.26 నుంచి 6.48 వరకు | విశాఖపట్నం | ఉ6.12 నుంచి 6.48 వరకు |
| శ్రీకాళహస్తి | ఉ6.25 నుంచి 6.48 వరకు | సాలూర్ | ఉ6.12 నుంచి 6.49 వరకు |
| శ్రీశైలం | ఉ6.28 నుంచి 6.48 వరకు | చెన్నై | ఉ6.22 నుంచి 6.48 వరకు |
| హైద్రాబాద్ | ఉ6.31 నుంచి 6.47 వరకు | బెంగళూర్ | ఉ6.33 నుంచి 6.47 వరకు |
| భద్రాచలం | ఉ6.21 నుంచి 6.48 వరకు | మధురై | ఉ6.30 నుంచి 6.47 వరకు |
| విజయవాడ | ఉ6.22 నుంచి 6.48 వరకు | త్రివేంద్రం | ఉ6.34 నుంచి 6.46 వరకు |
| రాజమండ్రి | ఉ6.17 నుంచి 6.48 వరకు | ఢిల్లీ | ఉ6.40 నుంచి 6.44 వరకు |
| అన్నవరం | ఉ6.15 నుంచి 6.49 వరకు | కలకత్తా | ఉ5.53 నుంచి 6.50 వరకు |

## 27 నక్షత్రాలలో చేయదగిన విశేష పరిహారములు

**శ్రవణా నక్షత్రం :** శనివారంతో కూడిన శ్రవణా నక్షత్ర రోజున మధ్యాహ్నం భోజనం బదులుగా చింతపండుతో చేసిన పులిహోరనే భోజనంగా స్వీకరిస్తూ (ఇతర కూరలు, పచ్చళ్లు, సాంబార్లు వద్దు), చివరలో చిక్కగా ఉన్న మజ్జిగను ఒక గ్లాసు నిదానంగా త్రాగండి. ఇలా చేసినందున, ఏవిధంగా ఋణబాధలు తీరగలవోననే చక్కని పరిష్కార మార్గం నెమ్మది నెమ్మదిగా మీ మదిలోనికి ప్రవేశిస్తుంది. దానితో సంతోషపడగలరు.

**ధనిష్ఠ నక్షత్రం :** దక్షిణాయనంలోని ఆరుమాసాలలో మాత్రమే, ధనిష్ఠ నక్షత్రం వచ్చిన రోజున మధ్యాహ్న భోజనంలో కేవలం కారం లేకుండా పులుపు, తీపి, ఉప్పదనాలతో ఉండే సాత్త్విక భోజనాన్ని చేయండి. పెరుగు భుజించవద్దు. వీలైతే భోజనాన్ని అభిజిత్ సమయంలో అనగా మధ్యాహ్నం 11గం॥45ని॥ల నుంచి 12గం॥30 నిముషాల వరకు ఉన్న సమయంలోనే తీసుకోండి. ఇలా చేసినందున మీ మనసులో ఏర్పడే శత్రుత్వ పోకడలు తగ్గుముఖం పట్టటమే కాక, అందరితో కలిసిమెలిసి ఉండాలనే తాపత్రయం పెరుగును. దీనివలన కీర్తిప్రతిష్ఠలు రాణిస్తాయి.

**శతభిష నక్షత్రం :** శతభిషా నక్షత్రం వచ్చిన రోజున మంగళవారం కాకుండా ఉండాలి. మిగిలిన వారాలలోనే ఆచరించాలి. ఏమిటంటే తెల్ల నువ్వులు, బెల్లంతో చేసిన పప్పు ఉండలను కనీసం ఉదయం 9గంటల లోపల అరగంట పాటు దుమ్ము, ధూళి పడకుండా సూర్యకిరణాలు సోకేలా ఉంచాలి. తదుపరి రెండు ఉండలను మాత్రమే ప్రసాదంగా భావించి స్వీకరించాలి. ఆ తర్వాతనే అల్పాహారం సేవించాలి. ఇలా 11సార్లు చేసినందున సమయస్ఫూర్తిగా మాట్లాడే అవకాశాలు రావటమే కాక, జీవితస్థిరత్వానికి అవసరమైన స్థితి గతులను అంచనా వేసి స్థిరత్వం పొందగల సామర్థ్యం వచ్చు సూచన కలదు.

**పూర్వాభాద్ర నక్షత్రం :** ప్రతినెలలో వచ్చే పూర్వాభాద్ర నక్షత్ర రోజున (శనివారం కాకుండా ఉండాలి) దానిమ్మగింజలను మధ్యాహ్నభోజనంలో పెరుగన్నంలో గానీ లేక విడిగా గానీ స్వీకరించినట్లయితే...లలితా సహస్రనామావళిలోని 468వ నామమైన వజ్రేశ్వరి దేవి అనుగ్రహం కల్గును. ఈవిధంగా 27సార్లకు తక్కువ కాకుండా చేస్తే, కుటుంబ సభ్యులతో ఇతరులతో, బంధువులతో పూర్తిస్థాయిలో సంబంధ బాంధవ్యాలు మెరుగుపడటానికి అవసరమైన బుద్ధిబలాన్ని పొందగలరు.

**ఉత్తరాభాద్ర నక్షత్రం :** ప్రతిమాసంలో వచ్చే ఉత్తరాభాద్ర నక్షత్రం రోజున వారం ఏదైనప్పటికీ, సాయంత్రం 6గంటల నుంచి 8గంటల మధ్యకాలంలో హిందోళరాగంతో ఉన్న కీర్తనలు గానీ లేక వాద్య సంగీతంగానీ పలుమార్లు వింటుంటే... అనవసర ఆందోళనలు, భయాలు తగ్గి త్వరితగతిలో మంచినిర్ణయాలు తీసుకొనగలరు.

**రేవతి నక్షత్రం :** చైత్ర, జ్యేష్ఠ, శ్రావణ, ఆశ్వీజ, మార్గశిర, మాఘమాసాలలో వచ్చే రేవతి నక్షత్రం రోజులలోని రాహుకాల సమయాలలో నానబెట్టి మొలకెత్తిన పచ్చపెసలను రెండు పిడికెడులు తినాలి. తిన్న తదుపరి పావుచెంచా తేనెను చప్పరించాలి. మధుమేహ వ్యాధిగ్రహస్తులు చేయవద్దు. ఇలా చేసినందున కొన్ని కొన్ని సందర్భాలలో మందగించిన బుద్ధిబలం అద్భుతంగా పుంజుకొని, సరియైన నిర్ణయాలు తీసుకుని లబ్ధి పొందేలా విజయ పంథాలో వెళ్లగలుగుతారు. అయితే ఈ పిరహారమును మాసం తప్పకుండా ఉండేలా 3 సంవత్సరాల పాటు ఆచరించాలి. మాసం తప్పినచో నిష్ప్రయోజనంగా భావించాలి.

## సోమవారం వివాహం ప్రశస్థమే

సోమవారం వివాహమునకు యోగ్యతకాదనియు, వివాహం నిషిద్ధమనియు పలువురు వ్యాఖ్యానిస్తుంటారు. పూర్వకాలామృతము, పురుషార్ధచింతామణి అనే రెండే రెండు గ్రంధాలలోనే సోమవారం ప్రశస్థము కాదని ఉన్నది. ఈ రెండు గ్రంధాలలో 'సోమే సుపత్నీ ప్రదం' అనే వాక్యము ఉన్నచో బాగుండేది. కానీ 'సోమే సపత్నీప్రదం' అని ముద్రితమైనది. 'సు' అక్షరానికి బదులుగా 'స' అక్షరము ముద్రితమైనందున, పలుచోట్ల సోమవారం వివాహానికి తగదని భావిస్తుంటారు. కానీ అత్యధిక ప్రామాణిక గ్రంధాలు సోమవారం నాడు వివాహం చేయుట సమ్మతమని మహాప్రశస్థమని అత్యంత శుభకరమని స్పష్టం చేసినవి. ధర్మసింధు, నిర్ణయసింధు, అగ్నిపురాణం, బృహద్ దైవజ్ఞరంజనం, బృహస్సంహిత,వాయు పురాణం, నారదసంహిత, గర్గసంహిత, ముహూర్తమార్తాండం, ముహూర్తపారిజాతం, రత్నసారం, ముహూర్తప్రదర్శిని, వశిష్ఠసంహిత, ముహూర్త చింతామణి, ముహూర్తదర్పణం, మానసారం, ముహూర్తసంగ్రహం, జ్యోతిషరత్నమాల, రాజమార్తాండం, ముహూర్తరత్నావళి, వివాహ బృందావనం, జ్యోతిర్విద్యాభరణం, జ్యోతిర్నిబంధనం, ముహూర్తముక్తావళి, ముహూర్తగణపతి, ముహూర్తప్రదీపం, విద్యామాధవీయం, సనత్కుమారసంహిత మరియు రత్నమాల అనబడే దాదాపు 30 ప్రామాణిక గ్రంధములలో సోమవారం నాడు వివాహం ఆచరించుట మహా ప్రశస్థమని కూడినట్లుగా తెలియజేయబడినది.

సోమవారం వివాహం చేయకూడదని చెప్పిన గ్రంధములు కేవలం రెండు మాత్రమే అవి పూర్వకాలామృతం, పురుషార్ధచింతామణి. దాదాపు 30 గ్రంధములు అనుకూలమని చెప్పగా కేవలం రెండు గ్రంధములు మాత్రం ప్రతికూలమని తెల్పినవి. ఈ రెండు గ్రంధములకు ఆధిక్యత లేనే లేదని పండితులు నిస్సంకోచంగా అంగీకరించవలసి ఉన్నది. ఆధిక్య గ్రంధములు స్పష్టంచేసిన సోమవారాన్ని వివాహములకు వినియోగించుకునేది.

తొలి తెలుగు స్వదేశీ విదేశీ
పంచాంగం
(ఇండియా,న్యూయార్క్,లండన్,లాస్‌ఏంజిల్స్)
గ్రహభూమి

## మిధునరాశి

| |
|---|
| శ్రీ మన్మధ : ఆదాయం:11, వ్యయం:5, రాజ్యపూజ్యం:2, అవమానం: 2 |
| శ్రీ దుర్ముఖి : ఆదాయం:14, వ్యయం:11, రాజ్యపూజ్యం:7, అవమానం:3 |

**జనవరి :** శక్తికి మించిన కార్యాలు వద్దు. నమ్మినవారిలో శత్రువు లున్నారని గ్రహించాలి. ఆశలు నిరాశలు కావు. హామీలు ఇవ్వవద్దు. ఋణ విషయంలో అప్రమత్తతవసరము. సరిక్రొత్త ఆలోచనలకు తెరతీస్తారు. అవివాహితులకు శుభవార్తలు ఉంటాయి. జనవరి 10 మధ్యాహ్నం 3.31 నుంచి 12 రాత్రి 7.22 వరకు ప్రతికూల సమయము.

**ఫిబ్రవరి :** ఆర్ధిక సామాజిక విలువలపై శ్రద్ధ పెరుగును. సంయమనం, సమయస్ఫూర్తి మాసాంతంలో అవసరం. అవివాహితులకు శుభవార్తలు. మిత్రశతృత్వాలను గమనించలేరు. వాదనాశక్తిని పెంచుతారు. వాగ్దానములు తగ్గిస్తారు. అంతర్గత శతృవులపై దృష్టి. ఫిబ్రవరి 6 అర్ధరాత్రి 1.13 నుంచి 8 అర్ధరాత్రి దాటిన తదుపరి 4.10 వరకు ప్రతికూలం.

**మార్చి :** వాగ్ధోరణిలో అసత్యాలు దొర్లును. కార్యసిద్ధి ఉండదు. 3వవారంలో పంతాలకు దూరంగా ఉంటారు. రహస్య సమాచారం సేకరిస్తారు. బుద్ధిబలం తగ్గును. భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. కార్య బాధ్యతలు సజావుగా నిర్వహిస్తారు. పంతాలకు వెళ్లి సమస్యలపాలగుదురు. ఇతరులపై విమర్శలు, దూషణలను తగ్గిస్తారు. మార్చి 5 మధ్యాహ్నం 11.23 నుంచి 7 మధ్యాహ్నం 2.48 వరకు వ్యతిరేక సమయమని గ్రహించాలి.

**ఏప్రిల్ :** ఆర్ధికచిక్కులు, విసుగు, ఆందోళన పెరుగును. శుభసంకేతాలు తగ్గును. ఆర్ధికమాంద్యం అధికం. శతృవులపై విజయం సాధించలేరు. శీఘ్ర నిర్ణయాలు ఫలితాలనివ్వవు. మంచి మార్పులకై అన్వేషిస్తారు. మాసాంతంలో స్వల్ప ప్రశాంతత. నిరుద్యోగులకు శుభవార్తలు. ఏప్రిల్ 28 రాత్రి 3.14 నుంచి మే 1 ఉదయం 8.39 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**మే :** వాగ్ధోరణిలో మార్పులుండవు. స్థిర సంభాషణలు మానుకుంటారు. రహస్య అంశాలు వ్యక్తిత్వాన్ని దెబ్బతీస్తాయి. ఋణ సదుపాయం తగ్గును. మానసికవత్తిడులు, చికాకులు పెరుగును. వ్యూహాత్మక అంశాలు ఛేధించ లేరు. మిత్ర శతృత్వాలను గమనించి వ్యవహరించాలి. మే 26 ఉదయం 8.51 నుంచి 28 మధ్యాహ్నం 3.57 వరకు ప్రతికూలం.

**జూన్ :** రాజీ ప్రయత్నాలు నెరవేరును. ప్రతిబంధకాలు స్వల్పంగా తగ్గును. మనోబలం,బుద్ధిబలం పెరుగును. ఉన్నత వ్యక్తులచే కార్యసిద్ధి. రెండవ పక్షంలో ఆర్ధికమాంద్యం తగ్గును. వాగ్ధానాలు భంగం కావు. కీలక నిర్ణయా లతో విజయలబ్ధి. జూన్ 22 మధ్యాహ్నం 2.40 నుంచి 24 రాత్రి 9.23 వరకు అనుకూల సమయం కాదని గమనించాలి.

**జూలై :** అసత్య ఆరోపణలు తగ్గిస్తారు. కంఠం నుంచి ఉదరం వరకు సమస్యలున్నవి. విధి విధానాలలో మార్పులు కల్గును. బుద్ధిబలంతో తీసుకునే నిర్ణయాలచే విమర్శలు తట్టుకుంటారు. హామీ ప్రయత్నాలు నెరవేరును. అవివాహితులకు వివాహయోగం. జూలై 19 రాత్రి 9.52 నుంచి 21 అర్ధరాత్రి తదుపరి 3.40 వరకు ప్రతికూలం.

**ఆగస్టు :** కార్యదీక్షాబాధ్యత తీసుకుంటారు. గృహ వాతావరణం ఆశాజనకం. సమయస్ఫూర్తిని పాటించలేరు. క్షమాపణలు తరచూ ఇవ్వవలసి ఉండును. స్థిర నిర్ణయాలు వాయిదా పడును. నిత్య దినచర్యలో మార్పులధికము. ఆర్భాట వ్యవహారాలకు దూరంగా ఉంటారు. ఆగస్టు 16 ఉదయం 6.36 నుంచి 18 మధ్యాహ్నం 11.49 వరకు ప్రతికూల సమయము.

**సెప్టెంబరు :** మనోస్థైర్యం పెరుగును. కీర్తి ప్రతిష్ఠలు కాపాడుకుంటారు. అధికారుల వత్తిడి తగ్గును. ఇష్టార్ధ సిద్ధి కల్గును. అకారణ విరోధాలు సమసి పోవును. స్పెక్యులేషన్ స్వల్ప రాణింపు. తోబుట్టువులతో మాట పట్టింపులు. బంధువుల ఆదరణ సంపాదిస్తారు. ధనక్షయానికి మాసాంతంలో అడ్డుకట్టవ వేస్తారు. నూతన నిర్ణయాలు వినగలరు. సెప్టెంబరు 12 సాయంత్రం 4.03 నుంచి 14 రాత్రి 9.39 వరకు అనుకూలం కాదు.

**అక్టోబరు :** మిత్రభేదం ఉండదు. గృహనిర్మాణ పనులపై ఆసక్తి పెరుగును. అనవసర ఆవేశాలకు వెళ్లటంతో కీర్తి ప్రతిష్ఠలకు దెబ్బ తగులును. చలాకీతనం, కళాకాంతులు తగ్గును. నీచ వ్యక్తుల సహవాసం తగ్గిస్తారు. సోదర నిర్ణయాలలో మార్పులుండవు. కుటుంబ వ్యక్తుల ప్రవర్తనలో మార్పులు గమనిస్తారు. అక్టోబరు 9 అర్ధరాత్రి తదుపరి 12.50 నుంచి 12 ఉదయం 7.46 వరకు ప్రతికూలం.

**నవంబరు :** మాసం మధ్యలో సొంతవారితో విభేదాలధికం. కార్యసిద్ధికి ఆటంకాలు పెరుగును. ముఖ్య వ్యక్తికి ప్రాధాన్యత ఇవ్వలేరు. స్వీయకల్పనా శక్తి పెరుగును. ప్రతిబంధక సమస్యలకు సలహాలు తీసుకోలేరు. శరీరానికి వైద్య సేవలవసరం. ఆర్ధిక సామాజిక విలువలపై రెండవపక్షంలో శ్రద్ధ పెంచుతారు. అవివాహితులకు అవకాశాలు పెరుగును. నవంబరు 6 ఉదయం 7.58 నుంచి 8 సాయంత్రం 4.27 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు :** కళత్రంచే ఖర్చులధికము. స్థానచలన అవకాశాలు మెండు. కుటుంబ నిర్ణయాలు ఓ కొలిక్కి వచ్చును. భాగస్వామ్య చర్చలు సానుకూలం. సంతాన అవాంతరములుండవు. వివేకంతో ప్రతివిషయాన్ని వ్యవహరించాలి. వ్యక్తిత్వ లోపాలను దీర్ఘంగా పసిగట్టలేరు. ప్రతిభకు రాణింపు మాసాంతంలో కలదు. డిశంబరు 3 మధ్యాహ్నం 1.44 నుంచి 5 రాత్రి 10.58 వరకు తిరిగి 30 రాత్రి 7.36 నుంచి జనవరి 1 అర్ధరాత్రి తదుపరి 4.26 వరకు ప్రతికూల సమయం.

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ మన్మథ నామ సంవత్సర ఫాల్గుణమాస బ.అష్టమి శుక్రవారం నుంచి శ్రీ దుర్ముఖి నామ సంవత్సర చైత్రమాస బ.అష్టమి శనివారం వరకు

## 2016 APRIL ఏప్రిల్

ఏప్రిల్ నెలంతయూ వృశ్చికరాశిలో కుజ శనుల సంఘర్షణ, సింహరాశిలో గురుచండాలయోగ ప్రభావం అధికం. ప్రతివారు ఈశ్వరారాధన తప్పక చేయాలి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము:సా4.40-5.28<br>రా.కా: సా4.30-6.00 | | **3**<br>బ.దశమి ఉ7.28<br>బ.ఏకాదశి తె5.38<br>శ్రవణం మ1.51<br>వ.సా5.37-7.08 | **10**<br>శు.చవితి రా2.54<br>కృత్తిక సా6.08<br>వ.ఉ7.21-8.47 | **17**<br>శు.ఏకాదశి రా1.06<br>మఘ రా7.33<br>వ.ఉ6.25-8.10<br>తె4.26 లగాయితు | **24**<br>బ.విదియ మ3.34<br>విశాఖ మ1.06<br>వ.సా5.32-7.18 |
| MON సోమ<br>దుర్ము: మ12.35-1.24<br>మ3.02-3.51<br>రా.కా:ఉ7.30-9.00 | | ● **4**<br>బ.ద్వాదశి రా3.07<br>ధనిష్ఠ మ12.32<br>వ.రా7.09-8.37 | **11**<br>శు.పంచమి రా12.26<br>రోహిణి సా4.12<br>వ.ఉ8.50-10.18<br>వ.రా9.30-11.00 | **18**<br>శు.ద్వాదశి రా3.19<br>పూర్వఫల్గుణిరా10.14<br>వ.శేషం ఉ6.13వరకు | **25**<br>బ.తదియ సా5.33<br>అనూరాధ మ3.40<br>వ.రా9.47-11.32 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.30-9.19<br>రా10.59-11.46<br>రా.కా: మ3.00-4.30 | | **5**<br>బ.త్రయోదశిరా12.04<br>శతభిషం ఉ10.35<br>వ.సా4.20-5.46 | **12**<br>శు.షష్ఠి రా10.40<br>మృగశిర మ2.54<br>వ.రా11.07-12.41 | **19** ○<br>శు.త్రయోదశి తె5.46<br>ఉత్తర రా1.10<br>వ.ఉ6.19-8.06 | **26**<br>బ.చవితి రా7.11<br>జ్యేష్ఠ సా5.54<br>వ.రా2.30-4.13 |
| WED బుధ<br>దుర్ము:మ11.45-12.34<br>రా.కా:<br>మ12.00-1.30 | | **6**<br>బ.చతుర్దశి రా8.37<br>పూర్వాభాద్ర ఉ8.09<br>ఉత్తరాభాద్ర తె5.21<br>వ.సా4.38-6.02 | **13**<br>శు.సప్తమి రా9.41<br>ఆర్ద్ర మ2.22<br>వ.రా2.29-4.06 | **20**<br>శు.చతుర్దశిపూర్తిగా<br>హస్త తె4.15<br>వ.ఉ10.39-12.27 | **27**<br>బ.పంచమి రా8.23<br>మూల రా7.43<br>వ.సా6.00-7.43 |
| THU గురు<br>దుర్ము:ఉ10.07-10.56<br>మ3.02-3.51<br>రా.కా:మ1.30-3.00 | | **7**<br>ఫాల్గుణఅమావాస్య<br>సా4.53<br>రేవతి రా2.22<br>వ.మ3.51-5.15 | **14**<br>శు.అష్టమి రా9.29<br>పునర్వసు మ2.36<br>వ.రా10.56-12.36 | **21**<br>శు.చతుర్దశి ఉ8.20<br>చిత్ర పూర్తిగా<br>వ.మ1.16-3.04 | **28**<br>బ.షష్ఠి రా9.04<br>పూర్వాషాఢ రా9.03<br>వ.ఉ5.51-7.32<br>వ.తె5.18 లగాయితు |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.32-9.21<br>మ12.36-1.24<br>రా.కా:ఉ10.30-12.00 | **1**<br>బ.అష్టమి ఉ8.54<br>పూర్వాషాఢ మ2.17<br>వ.రా10.20-11.57 | **8**<br>చైత్రమాసారంభం<br>శు.పాడ్యమి మ1.05<br>అశ్విని రా11.23<br>వ.రా7.52-9.16 | **15**<br>శు.నవమి రా10.03<br>పుష్యమి మ3.36<br>వ.తె5.18 లగాయితు | **22**<br>పూర్ణిమ ఉ10.53<br>చిత్ర ఉ7.19<br>వ.మ1.37-3.25 | **29**<br>బ.సప్తమి రా9.10<br>ఉత్తరాషాఢ రా9.48<br>వ.రా1.49-3.25<br>వ.శేష ఉ6.57వరకు |
| SAT శని<br>దుర్ము:ఉ6.05-7.43<br>రా.కా:ఉ9.00-10.30 | **2**<br>బ.నవమి ఉ8.34<br>ఉత్తరాషాఢ మ2.27<br>వ.రా6.21-7.54 | **9**<br>శు.విదియ ఉ9.22<br>శు.తదియ తె5.55<br>భరణి రా8.34<br>వ.ఉ7.51-9.16 | **16**<br>శు.దశమి రా11.18<br>ఆశ్లేష సా5.17<br>వ.శేషం ఉ7.01వరకు | **23**<br>బ.పాడ్యమి మ1.19<br>స్వాతి ఉ10.18<br>వ.సా4.33-6.20 | **30**<br>బ.అష్టమి రా8.36<br>శ్రవణం రా9.55<br>వ.రా1.49-3.23 |

### పండుగలు

3 పాపమోచన ఏకాదశి
6 మాసశివరాత్రి
7 క్రొత్తఅమావాస్య
8 శ్రీ దుర్ముఖి ఉగాది వసంతనవరాత్రారంభం, తైలాభ్యంగనం, నవవస్త్రాభరణధారణ, చైత్రమాసచంద్రోదయం
9 రజ్జబ్ నెల ప్రారంభం సౌభాగ్యగౌరీవ్రతం శివడోలోత్సవం
10 గణేశదమనపూజ భానుకృత్తిక
11 శ్రీవ్రతం
12 యమునాజయంతి(మధుర)
13 సూర్యదమనపూజ మేషసంక్రాంతి, తమిళసంవత్సరాది విషు(కేరళ)
14 అశోకాష్టమి
15 శ్రీరామనవమి
16 ధర్మరాజదశమి శాలివాహనజయంతి
17 కామదాఏకాదశి, విష్ణుడోలోత్సవం
18 వామనద్వాదశి
19 అనంగత్రయోదశి, మన్మధపూజ మహావీరజయంతి
20 కర్దమక్రీడ
22 మహాచైత్రి, శచీంద్రపూజ హనుమద్విజయోత్సవం
25 సంకష్టహరచతుర్థి

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### ఏప్రిల్ శుభసమయములు

| | |
|---|---|
| శ్రీ మన్మథ ఫాల్గుణమాసము | |
| 01 | శుక్ర బ.నవమి ఉత్తరాషాఢ సా4.58-9.12 |
| 02 | శని బ.దశమి ఉత్తరాషాఢ మ12.36-2.27 |
| 02 | శని బ.దశమి శ్రవణం సా4.54-6.20 |
| 02 | శని బ.దశమి శ్రవణం రా7.55-9.08 |
| 03 | ఆది బ.ఏకాదశి ధనిష్ఠ రా7.09-9.04 |
| శ్రీ దుర్ముఖి చైత్రమాసము | |
| 11 | సోమ శు.పంచమి రోహిణి ఉ7.49-8.49 |
| 11 | సోమ శు.పంచమి రోహిణి ఉ10.20-12.32 |
| 13 | బుధ శు.సప్తమి పునర్వసు సా04.12-8.26 |
| 14 | గురు శు.అష్టమి పునర్వసు ఉ7.37 -10.11 |
| 14 | గురు శు.అష్టమి పుష్యమి సా6.13-8.22 |
| 15 | శుక్ర శు.నవమి పుష్యమి ఉ7.33-8.23 |
| 15 | శుక్ర శు.నవమి పుష్యమి ఉ9.15-11.45 |
| 16 | శని శు.దశమి మఘ సా6.05-8.14 |
| 17 | ఆది శు.ఏకాదశి మఘ ఉ8.11-మ12.31 |
| 17 | ఆది శు.ఏకాదశి మఘ సా6.01-7.33 |
| 20 | బుధ శు.చతుర్దశి హస్త ఉ7.13-10.38 |
| 20 | బుధ శు.చతుర్దశి హస్త సా5.49-7.58 |
| 21 | గురు పూర్ణిమ చిత్ర ఉ8.21-మ01.15 |
| 21 | గురు పూర్ణిమ చిత్ర సా5.45-7.54 |
| 22 | శుక్ర పూర్ణిమ స్వాతి ఉ7.20-8.20 |
| 22 | శుక్ర పూర్ణిమ స్వాతి ఉ9.12-10.53 |
| 22 | శుక్ర బ.పాడ్యమి స్వాతి ఉ10.54-12.30 |
| 22 | శుక్ర బ.పాడ్యమి స్వాతి సా5.41-7.50 |
| 23 | శని బ.పాడ్యమి స్వాతి ఉ7.31-10.18 |
| 24 | ఆది బ.తదియ అనూరాధ రా7.19-7.42 |
| 25 | సోమ బ.తదియ అనూరాధ ఉ6.53-మ12.29 |
| 27 | బుధ బ.పంచమి మూల ఉ08.46-11.39 |
| 29 | శుక్ర బ.సప్తమి ఉత్తరాషాఢ ఉ6.37-8.17 |
| 29 | శుక్ర బ.సప్తమి ఉత్తరాషాఢ ఉ10.50-12.29 |
| 29 | శుక్ర బ.సప్తమి ఉత్తరాషాఢ సా5.13-7.22 |
| 30 | శని బ.అష్టమి శ్రవణం ఉ7.28-8.33 |
| 30 | శని బ.అష్టమి శ్రవణం ఉ10.46-మ12.57 |

*Engagements*

## రత్నాలను ధరించకూడని నక్షత్ర జాతకులు

ప్రస్తుత రోజులలో అనేకమంది జాతకదోషాల కొరకు నవరత్నాలను విడివిడిగా ధరించటం లేక నవరత్నాలన్నింటిని కలిపి ధరించటము జరుగుచున్నది. సహజంగా రత్నాలను 365 రోజులు ధరిస్తూనే ఉంటారు. కానీ ఇలా ధరించకూడదు. అయితే నవరత్నాలను కలిపి ఉన్న ఉంగరాన్ని ధరించే సమయంలో కూడా కొన్ని నక్షత్ర జాతకులు కొన్ని కొన్ని వారాలను విసర్జించాలి. అంతేకాక ఏ రత్నాలను ఏ నక్షత్ర జాతకులు అసలు ధరించకూడదనే వివరాన్ని కూడా తెలుసుకోవటం మంచిది.

ఈ పరంపరలో సూర్యగ్రహ రత్నమైన మాణిక్యాన్ని, కుజగ్రహ రత్నమైన పగడాన్ని పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, ఆర్ద్ర, స్వాతి, శతభిషం నక్షత్ర జాతకులు అసలు ధరించరాదు. ఈ జాతకులే నవరత్న ఉంగరాన్ని మంగళ, ఆదివారాలలో విసర్జించాలి. చిత్ర, ధనిష్ఠ, మృగశిర, అశ్వని, మఖ, మూల నక్షత్ర జాతకులు శనిగ్రహ రత్నమైన నీలాన్ని, రాహుగ్రహ రత్నమైన గోమేధికాన్ని ధరించకూడదు. ఒకవేళ నవరత్న ఉంగరమైతే శనివారం విసర్జించాలి. ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్ర జాతకులు కుజగ్రహ రత్నమైన పగడాన్ని ధరించరాదు. నవరత్న అంగులీయకమైనచో ఈ జాతకులు మంగళవారం నాడు ధరించరాదు. భరణి, పుబ్బ, పూర్వాషాఢ, రోహిణి, హస్త, శ్రవణా నక్షత్ర జాతకులు గురుగ్రహ రత్నమైన కనక పుష్యరాగాన్ని ధరించరాదు. ఇదే నక్షత్ర జాతకులు నవరత్న ఉంగరాన్ని ధరించాలనుకుంటే గురువారం మినహా మిగిలిన రోజులలో ధరించవచ్చు.

పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్ర జాతకులు చంద్రగ్రహ రత్నమైన ముత్యమును, శుక్రగ్రహ రత్నమైన వజ్రమును ధరించరాదు. ఇదే నక్షత్ర జాతకులు నవరత్న అంగులీయకమును ధరించాలనుకుంటే సోమ, శుక్రవారాలను త్యజించి మిగిలిన రోజులలో ధరించ వచ్చును. కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్ర జాతకులు శనిగ్రహ రత్నమైన నీలమును జీవిత కాలంలో ధరించరాదు. అలాకాక నవరత్న ఉంగరాన్ని ధరించాలనుకుంటే ఆదివారం మినహా మిగతా రోజులలో ధరించేది.

ముఖ్యంగా ఈ నవరత్నాలను చేతి వ్రేళ్లకు ఉంగరాలుగా కాకుండా కొందరు కంఠాభరణాలుగాను, కర్ణాభరణాలుగాను ధరిస్తుంటారు. అయితే పైన వివరించిన వివరములన్నియు చేతి ఉంగరాలకే వర్తించునే తప్ప కంఠాభరణాలకి, కర్ణాభరణాలకి వర్తించదు. కనుక స్త్రీ, పురుషులు కర్ణ, కంఠాభరణాలను అన్నీ రోజులలో ధరించవచ్చును.

## అష్టమ, అర్ధాష్టమ, ఏలినాటి శని జాతకులకు

## పుష్యమీ నక్షత్రంతో పరిహారం

2014 నవంబరు 3 నుంచి 2017 మే 25 వరకు మేషరాశి వారికి అష్టమశని, సింహరాశి జాతకులకు అర్ధాష్టమ శని జరుగును. తులారాశి జాతకులకు చివరిభాగం ఏలినాటి శని జరుగుతుండగా, వృశ్చికరాశి జాతకులకు ఏలినాటి శని రెండవభాగం, ధనూరాశి జాతకులకు ఏలినాటిశని మొదటిభాగం జరుగును. **కనుక మేష, సింహ, తుల, వృశ్చిక, ధనూరాశి జాతకులు తప్ప ఇతర రాశులవారు ఈ దిగువ పరిహారమును పాటించవద్దు.**

గురు, శుక్రమౌఢ్యాలు, ఆషాఢ భాద్రపద పుష్యమాసాలు కాని ఇతర నెలలలో మాత్రమే పుష్యమీ నక్షత్ర పరిహారాన్ని పాటించాలి. శనివారం సూర్యోదయం నుంచి, అర్ధరాత్రి వరకు పుష్యమీ నక్షత్రవ్యాప్తి ఉండాలి. భారతప్రభుత్వ దృగ్గణిత పంచాంగ సమాయాలు ఖచ్చితాలు. కనుక ఆ పంచాంగాలలో నక్షత్రవ్యాప్తి ఉందా లేదా, తెలుసుకుని పరిహారం పాటించండి.

అష్టమ, అర్ధాష్టమ, ఏలినాటిశని అనగానే ఎంతోమంది భయపడుతుంటారు. వారి వ్యక్తిగత జాతకాలను అనుసరించి అనుకూల మరియు ప్రతికూల ఫలితాలు వస్తుంటాయి. ఫలితాలు ఎలా ఉన్నప్పటికీ పుష్యమీ నక్షత్రం శనివారంతో కలిసిన రోజున ఈ పరిహారం పాటించండి.

రాతి ఉప్పు 20గ్రాములు, నల్లనువ్వులు 20గ్రాములు తీసుకుని రెండింటిని కలిపి రోటిలో దంచండి. ఈ మిశ్రమాన్ని 50 మిల్లీలీటర్ల నువ్వులనూనెలో కలిపి... పెద్ద ప్రమిదలోనికి తీసుకోండి. ఈ ప్రమిదలో 5 వత్తులను ఉంచి జమ్మిచెట్టు క్రింద దీపం వెలిగించాలి. ఈ దీపాన్ని సూర్యోదయం నుంచి ఉదయం 9.00 గంటల లోపల కానీ లేదా సాయంత్రం 6.00 గంటల నుంచి 10.00 గంటల లోపల మాత్రమే వెలిగించండి.

అష్టమ, అర్ధాష్టమ, ఏలినాటిశనితో ఉన్నవారు ప్రతికూల పరిస్థితులను ఎదుర్కొంటుంటే శనివార దీప ప్రజల్వన చేయండి. శనివారం నాడు పుష్యమి అర్ధరాత్రి వరకు ఉన్నటువంటి రోజులు అరుదు. కనుక ఓ పర్యాయం మాత్రమే ఆచరించండి. అంతకంటే ఎక్కువ రోజులు వచ్చినా కూడా ఆచరించవచ్చును.

ఏటిసూతకంలో ఉన్నవారు, గర్భవతులు, జాతాశౌచదినాలలో ఉన్నవారు ఆచరించవద్దు. పుష్యమీ శనివారం నాడు ఎరుపురంగు దుస్తులను ధరించవద్దు. వెలిగించుటకు వెళ్లేవారు ఒంటరిగా వెళ్లకుండా, కుటుంబ సభ్యులను గానీ, మిత్రులను గానీ, హితులను గానీ తోడుగా తీసుకుని వెళ్లండి. ఒకరికంటే ఎక్కువమందిని తీసుకుని వెళ్లవచ్చును.

పుష్యమీ శనివారం ఉదయ, సాయంత్ర సమయాలలో రెండుసార్లు దీపప్రజ్వలన చేయాలనుకున్నవారు మధ్యాహ్నభోజనంలో పెరుగును, లేక మజ్జిగను విసర్జించాలి. మధ్యాహ్నం భోజనం తదుపరి నిద్రకు ఉపక్రమించవద్దు. ప్రత్యేక నియమాలు ఏమియును లేవు. దీప ప్రజ్వలన చేసి తిరిగి వచ్చే సమయంలో పొరపాటున వెనుకకు తిరిగిననూ దోషం కాదు.

## నక్షత్ర ప్రకారం నామ నిర్ణయములు

శిశువుకు నక్షత్ర అక్షరాలతో నామకరణం చేయాలనే పట్టుదలతో ఉన్నవారు కూడా ఉన్నారు. ఇది శాస్త్రీయం కాదని చెప్పిననూ, వారి పట్టుదల వారికుంటుంది. పాఠకులు ఇప్పటికైనా నిజానిజాలు తెలుసుకుని, జన్మించిన శిశువుల జన్మ నక్షత్రాలను గుర్తుంచుకుని వారికి అనుకూలమైన నచ్చిన మెచ్చిన పేర్లతో నామకరణం చేసుకొనేది. అయితే ఈ నక్షత్ర అక్షరాలు ఈ దిగువ పొందుపరుస్తున్నాం.

| | |
|---|---|
| అశ్వని | చూ, చే, చో, లా |
| భరణి | లీ, లూ, లే, లో |
| కృత్తిక | అ, ఈ, ఉ, ఏ |
| రోహిణి | ఓ, వా, వీ, వూ - స్వా |
| మృగశిర | వే, వో, కా, కి-కృ, వై, శ్వే, క్ర |
| ఆర్ద్ర | కూ, ఖం, జ్ఞా, ఛ్ఛ |
| పునర్వసు | కే, కో, హా, హి |
| పుష్యమి | హూ, హే, హో, దా |
| ఆశ్లేష | డీ, డూ, డే, డో |
| మఖ | మా, మీ, మూ, మే - మృ |
| పుబ్బ | మో, టా, టీ, టూ |
| ఉత్తర | టే, టో, పా, పి - ఫ, పౌ |
| హస్త | పూ, షం, ణా, ఠా |
| చిత్ర | పే, పో, రా, రి - ప్ర, శ్రీ, బ్ర |
| స్వాతి | రూ,రే,రో,తా - హ్రు,ద్రో,ద్రౌ,త్రి |
| విశాఖ | తీ, తూ, తే, తో |
| అనూరాధ | నా, నీ, నూ, నే - స్నే |
| జ్యేష్ఠ | నో, యా, యి, యూ - శ్యా |
| మూల | యే, యో, బా, బి - జ్యో, భౌ |
| పూర్వాషాఢ | బూ, ధా, భా, డా - భై |
| ఉత్తరాషాఢ | బే, బో, జా, జీ |
| శ్రవణం | జూ, జే, జో, ఖా |
| ధనిష్ఠ | గా, గీ, గూ, గే |
| శతభిషం | గో, సా, సీ, సూ |
| పూర్వాభాద్ర | సే, సో, దా, ది |
| ఉత్తరాభాద్ర | దు, శ్యం, ఝూ, థా |
| రేవతి | దే, దో, చా, చి |

### గమనిక

ఒక్కో జన్మనక్షత్రానికి ఒక్కొక్క జంతువును ఆధారంగా చేసుకుని వివాహ నిర్ణయాలలో వధూవరులు వైర జంతువులుగా ఉన్నారని, వైరి జంతువులతో వివాహాలు చేయకూడదనటము సరికాదు. గతంలో వివాహం అయినప్పటికీ, ప్రస్తుత రోజులలో వారి నక్షత్రాలు వైర జంతువులుగా ఉన్నందున సమస్యలు వస్తున్నాయని పలువురు వ్యాఖ్యానించటం జరుగుతున్నది. ఇది కూడా సరికాదు.

కనుక మా కాలచక్రం, గ్రహభూమి పంచాంగాలలో నక్షత్రాలకు జంతు వివరాలు ఉండవని పాఠకులు గమనించేది. నామ ప్రారంభాలకు అక్షర ప్రాధాన్యత ఇవ్వవలసిన అవసరం లేనే లేదు. ఇందులో ఇచ్చిన అక్షరాలతో పేర్లు పెట్టుకొనమని మేము సలహా ఇవ్వటం లేదని పాఠకులు గమనించాలి. కేవలం పాఠకులు తెలుసుకోవటానికి మాత్రమేనని గమనించాలి.

- శ్రీనివాసగార్గేయ




శ్రీ మన్మథ : ఆదాయం:5, వ్యయం:5, రాజ్యపూజ్యం: 5, అవమానం: 2

శ్రీ దుర్ముఖి : ఆదాయం:8, వ్యయం:11, రాజ్యపూజ్యం:3, అవమానం: 3

**జనవరి :** ప్రాధాన్యత వ్యక్తులను గౌరవించలేరు. క్షణికావేశంతో ధనవ్యయం. విరోధాలు తగ్గుముఖం. ఆధిపత్య పోరు తగ్గును. జీవన సరళిలో విజయం ఉండును. మాసం మధ్యలో రాజీధోరణి ఎంతైనా అవసరం. మనోసంకటం సడలును. ముంజేతిసమస్య తీరును. భాగస్వామ్య చర్చలు నెరవేరును. ఆంతరంగికుల సలహాలను స్వీకరిస్తారు. జనవరి 12 రాత్రి 7.22 నుంచి 14 రాత్రి 10.16 వరకు అనుకూల సమయం కాదు.

**ఫిబ్రవరి :** వ్యక్తిగత విమర్శలచే న్యాయపోరాటం వద్దు. ఎత్తులకు పై ఎత్తులు వేయగలరు. అవివాహితులకు యోగం తక్కువ. రాజీప్రయత్నాలు నెరవేరును. కపట స్వభావుల మాటలకు లొంగవద్దు. 3వారంలో కళత్ర విభేదములు కలవు. స్థాన చలన అవకాశములు ఉన్నవి. రెండవపక్షంలో మానసిక సంఘర్షణలకు దూరంగా ఉండాలి. కల్మష వాతావరణం అధికము. ఫిబ్రవరి 8 అర్ధరాత్రి తదుపరి 4.10 నుంచి 11 ఉదయం 5.41 వరకు ప్రతికూలమని గమనించాలి.

**మార్చి :** ప్రతిబంధక వ్యవహారాలపై దృష్టి తగ్గిస్తారు. నూతన ప్రణాళికలు సిద్ధమగును. రహస్యమంత్రాంగం జోలికి వెళ్లరు. 2వవారంలో సంజాయిషీలు, క్షమాపణలు అధికము. 4వవారంలో ఆర్థికమాంద్యముంది. ఉద్యోగ, వ్యాపారులపై నిఘా ఉంది. రక్తసంబంధీకులచే సమస్యలున్నవి. మార్చి 7 మధ్యాహ్నం 2.48 నుంచి 9 మధ్యాహ్నం 3.40 వరకు వ్యతిరేక సమయం.

**ఏప్రిల్ :** ఆప్తమిత్రుల అండదండలుండును. దీర్ఘాలోచన అధికము. శస్త్రచికిత్స అనుకూలము. శక్తికి మించిన కార్యాలు చేయగలరు. సోమరితనం తగ్గును. స్పెక్యులేషన్ రాణింపు ఉండదు. అసత్య ఆరోపణలపై స్పందిస్తారు. పట్టింపులు తగ్గును. హామీలకై సమయం వృధా అగును. రాజకీయ వాసులకు అనుకూలం. ఏప్రిల్ 3 అర్ధరాత్రి తదుపరి 1.11 నుంచి 5 అర్ధరాత్రి తదుపరి 2.45 వరకు ప్రతికూల సమయమని గమనించాలి.

**మే :** శత్రువులచే మొండితనం పెరుగును. అసౌకర్యాలతో విసుగు అధికం. 2వ పక్షంలో ఆశాజనక పరిస్థితులు. నిద్రాసౌఖ్యం లేనందున స్వల్ప అనారోగ్యం. రహస్య చర్చలకు దూరంగా ఉంటారు. మేనత్త, చిన్నాన్న విషయాలలో పట్టింపులు పెంచుకుంటారు. హామీ సంతకాలకు దూరంగా ఉండాలి. మే 1 ఉదయం 8.39 నుంచి 3 మధ్యాహ్నం 2.47 వరకు తిరిగి 28 మధ్యాహ్నం 3.57 నుంచి 30 రాత్రి 8.33 వరకు వ్యతిరేక సమయం.

**జూన్ :** కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. ఆర్థిక వెసలుబాటు ఉండును. కపట స్వభావుల ఆట కట్టిస్తారు. స్థానచలన అవకాశములుండవు. భాగస్వామ్య చిక్కులు తగ్గును. శత్రు విజృంభణ ఎదుర్కొంటారు. శుభకార్య చర్చలచే లబ్ధి. 2వ పక్షంలో కఠిన నిర్ణయాలు తీసుకోలేరు. జూన్ 24 రాత్రి 9.23 నుంచి 26 అర్ధరాత్రి తదుపరి 2.21 వరకు అనుకూల సమయం కాదు.

**జూలై :** బంధుప్రీతిని స్వాగతిస్తారు. శరీరశ్రమ అధికము. మనోవ్యాకులత్వం తగ్గును. సమయస్ఫూర్తిని పాటిస్తారు. న్యాయలావాదేవీలచే ఉపశమనం. స్థిర నిర్ణయాలు వాయిదా పడును. తోబుట్టువులచే అంగీకార అనుకూలం. జూలై 21 అర్ధరాత్రి తదుపరి 3.40 నుంచి 24 ఉదయం 7.52 వరకు ముఖ్య అంశాలకు ప్రాధాన్యత ఇవ్వవద్దు.

**ఆగస్టు :** అవివాహితులకు వివాహయోగం. బుద్ధిబలంతో అనుకూల నిర్ణయాలు తీసుకుంటారు. స్థిరాస్తి అంశాలలో నిర్ణయాలు వాయిదా పడును. స్పెక్యులేషన్ రాణింపు కలదు. బంధువులతో శతృత్వాలు తగ్గును. మాసాంతంలో అంచనాలు తారుమారగును. ఆగస్టు 18 మధ్యాహ్నం 11.49 నుంచి 20 మధ్యాహ్నం 2.53 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**సెప్టెంబరు :** ఋణాన్వేషణకు సమయం కేటాయిస్తారు. పితృవర్గ నిర్ణయాలు శిరోధార్యంగా భావిస్తారు. ఆర్థిక విషయాలలో హామీలుండలేరు. ముఖ్య పనులలో పొరపాట్లు వచ్చును. భాగస్వామ్య చర్చలు వాయిదా పడును. సెప్టెంబరు 14 రాత్రి 9.39 నుంచి 16 రాత్రి 12.09 వరకు ఆవేశాలకు లోనుకాకుండా నిర్ణయాలు దాటవేసే ధోరణిలో ఉండాలి.

**అక్టోబరు :** మరమ్మత్తులకై ధనవ్యయం. పంతాలకు వెళ్లటంతో ఆరోపణలు ఎదుర్కొంటారు. కళత్ర సలహాలను స్వీకరించరు. మిత్ర శతృత్వాలను గమనించలేరు. స్థిరలావాదేవీలలో లోపాలు కనపడును. వాగ్దాన భంగములు పెరుగును. హామీలకై సమయం వృధా చేస్తారు. స్పెక్యులేషన్ రాణింపు లేదు. అక్టోబరు 12 ఉదయం 7.46 నుంచి 14 ఉదయం 10.54 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.

**నవంబరు :** మాస ప్రారంభంలో అశాంతి అధికం. క్రమంగా ప్రశాంత తను పొందుదురు. శరీరంపై గాయాలు రాగల అవకాశం. ప్రధాన శతృవుల ఆరా తీయగలరు. జీవనోపాధిలో స్థిరత్వం తగ్గును. స్పెక్యులేషన్ యోగించదు. సంతాన అంశాలపై రాజీయత్నాలు సాగును. నవంబరు 8 సాయంత్రం 4.27 నుంచి 10 రాత్రి 9.14 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు :** పెద్దల ఆశీస్సులను పొందగలగుతారు. అనవసర హామీలు ఇవ్వటంతో ధనవ్యయం. సంతాన అంశాలలో కఠిన నిర్ణయాలు తీసుకోలేరు. శుభకార్య పరంపరచే అనారోగ్యం. లౌకిక విషయాలపై ఆసక్తి కనపరచరు. ధర్మకార్యాలకు దగ్గరగుదురు. డిశంబరు 5 రాత్రి 10.58 నుంచి 8 ఉదయం 5.21 వరకు అనుకూల సమయం కాదని గమనించాలి.

PRANATHI TV నిత్యప్రవచకులు...

# కాలచక్రం

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

కాలచక్రం పంచాంగకర్త
శ్రీకాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత
పండిత శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ







దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైదరాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర చైత్ర బహుళ నవమి ఆదివారం నుంచి వైశాఖమాస బహుళ దశమి మంగళవారం వరకు

# 2016 MAY మే

4 మే 2016 ఉ8గం॥31ని॥ల నుంచి మే 28 మధ్యాహ్నం 1గం॥20ని॥ల వరకు వాస్తు మరియు అగ్నికర్తరులు కలవు. కనుక శంఖుస్థాపనలు, నూతులు త్రవ్వుట, గడ్డితో ఇండ్లకప్పులు నిషిద్ధము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.42-5.32<br>రా.కా: సా4.30-6.00 | 1<br>బ.నవమి రా7.23<br>ధనిష్ఠ రా9.22<br>వ.తె4.12-5.43 | 8<br>శు.విదియ సా5.51<br>రోహిణి రా2.07<br>వ.సా6.56-8.22 | 15<br>శు.నవమి మ12.41<br>పూర్వఫల్గుణి తె4.24<br>వ.ఉ10.43-12.29 | 22<br>బ.పాడ్యమి తె4.26<br>అనూరాధ రా9.34<br>వ.రా3.39-5.23 | 29<br>బ.సప్తమి ఉ6.18<br>బ.అష్టమి తె4.56<br>శతభిషం రా3.22<br>వ.ఉ10.58-12.32 |
| MON సోమ<br>దుర్ము: మ12.29-1.20<br>మ3.01-3.51<br>రా.కా:ఉ7.30-9.00 | 2<br>బ.దశమి సా5.29<br>శతభిషం రా8.09<br>వ.రా2.04-3.33 | 9<br>శు.తదియ మ2.52<br>మృగశిర రా12.09<br>వ.ఉ7.15-8.44 | 16<br>శు.దశమి మ2.50<br>ఉత్తర పూర్తిగా<br>వ.మ12.29-2.16 | 23<br>బ.విదియ పూర్తిగా<br>జ్యేష్ఠ రా11.37<br>వర్జ్యం లేదు | 30<br>బ.నవమి రా3.03<br>పూర్వాభాద్ర రా2.17<br>వ.ఉ9.29-11.00 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.16-9.07<br>రా10.56-11.41<br>రా.కా: మ3.00-4.30 | 3<br>బ.ఏకాదశి మ2.58<br>పూర్వాభాద్ర సా6.20<br>వ.రా3.01-4.27 | 10<br>శు.చవితి మ12.30<br>ఆర్ద్ర రా10.52<br>వ.ఉ8.06-9.37 | 17<br>శు.ఏకాదశి సా5.17<br>ఉత్తర ఉ7.19<br>వ.సా4.48-6.37 | 24<br>బ.విదియ ఉ5.47<br>మూల రా1.19<br>వ.ఉ8.11-9.54<br>వ.రా11.36-1.19 | 31<br>బ.దశమి రా12.39<br>ఉత్తరాభాద్ర రా12.41<br>వ.మ11.14-12.44 |
| WED బుధ<br>దుర్ము:మ11.39-12.29<br>రా.కా:<br>మ12.00-1.30 | 4<br>బ.ద్వాదశి మ11.55<br>ఉత్తరాభాద్ర సా4.01<br>వ.రా2.40-4.05 | 11<br>శు.పంచమి ఉ10.52<br>పునర్వసు రా10.23<br>వ.ఉ10.38-12.12 | 18<br>శు.ద్వాదశి రా7.52<br>హస్త ఉ10.25<br>వ.రా7.27-9.16 | 25<br>బ.తదియ ఉ6.45<br>పూర్వాషాఢ రా2.38<br>వ.మ11.27-1.08 | |
| THU గురు<br>దుర్ము:ఉ9.57-10.48<br>మ3.01-3.52<br>రా.కా:మ1.30-3.00 | 5<br>బ.త్రయోదశి ఉ8.29<br>బ.చతుర్దశి తె4.46<br>రేవతి మ1.18<br>వర్జ్యం లేదు | 12<br>శు.షష్ఠి ఉ10.05<br>పుష్యమి రా10.45<br>వ.ఉ6.30-8.08 | 19<br>శు.త్రయోదశిరా10.22<br>చిత్ర మ1.31<br>వ.రా7.48-9.36 | 26<br>బ.చవితి ఉ7.19<br>ఉత్తరాషాఢ రా3.32<br>వ.ఉ10.56-12.36 | |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.16-9.06<br>మ12.29-1.20<br>రా.కా:ఉ10.30-12.00 | 6 ●<br>చైత్రఅమావాస్యరా12.59<br>అశ్వని ఉ10.23<br>వ.ఉ6.52-8.16<br>వ.సా6.47-8.12 | 13<br>శు.సప్తమి ఉ10.10<br>ఆశ్లేష రా11.56<br>వ.మ12.11-1.52 | 20<br>శు.చతుర్దశిరా12.41<br>స్వాతి సా4.28<br>వ.రా10.42-12.29 | 27<br>బ.పంచమి ఉ7.28<br>శ్రవణం రా3.59<br>వ.ఉ7.36-9.14 | |
| SAT శని<br>దుర్ము:ఉ5.43-7.24<br>రా.కా:ఉ9.00-10.30 | 7<br>వైశాఖమాసారంభం<br>శు.పాడ్యమి రా9.17<br>భరణి ఉ7.25 కృత్తిక తె4.36,వ.సా6.00-7.25 | 14<br>శు.అష్టమి మ11.05<br>మఘ రా1.53<br>వ.మ12.55-2.38 | 21 ○<br>వైశాఖపూర్ణిమరా2.44<br>విశాఖ రా7.10<br>వ.రా11.34-1.20 | 28<br>బ.షష్ఠి ఉ7.08<br>ధనిష్ఠ రా3.56<br>వ.ఉ7.58-9.34 | |

### పండుగలు

1 కార్మికదినోత్సవం శుక్రమౌఢ్యారంభం
3 వరూధినీఏకాదశి
4 వాస్తుకర్తరి ఉ8.31
5 మాసశివరాత్రి
8 వైశాఖచంద్రోదయం
9 అక్షయతదియ, పరశురామజయంతి షాబాన్‌నెలప్రారంభం
11 శ్రీ శంకరజయంతి
13 అపరాజితాదేవి వ్రతం
14 వృషభసంక్రాంతి
16 శ్రీవాసవీజయంతి, బ్రహ్మంగారి జయంతి శ్రీ పద్మావతీ కళ్యాణోత్సవం
17 మోహినీఏకాదశి అన్నవరసత్యదేవకల్యాణం
18 జమదగ్నివ్రతం
20 శ్రీనృసింహజయంతి చిన్నమస్తాదేవీజయంతి
21 మహావైశాఖి, బుద్ధపూర్ణిమ శ్రీ అన్నమయ్యజయంతి
22 నారదజయంతి
25 సంకష్టహరచతుర్థి
28 కర్తరిత్యాగం మ1.28
31 శ్రీహనుమజ్జయంతి

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### మే శుభసమయములు

శ్రీ దుర్ముఖి వైశాఖమాసము

| | |
|---|---|
| 08 | ఆది శు.విదియ రోహిణి ఉ6.03-మ12.27 |
| 08 | ఆది శు.తదియ రోహిణి రా9.03-11.11 |
| 09 | సోమ శు.తదియ మృగశిర ఉ8.45-మ12.24 |
| 09 | సోమ శు.చవితి మృగశిర సా4.36-6.45 |
| 09 | సోమ శు.చవితి మృగశిర రా9.00-11.08 |
| 11 | బుధ శు.పంచమి పునర్వసు ఉ5.52-10.37 |
| 11 | బుధ శు.షష్ఠి పునర్వసు సా4.28-6.37 |
| 12 | గురు శు.షష్ఠి పుష్యమి ఉ8.09-9.55 |
| 12 | గురు శు.సప్తమి పుష్యమి ఉ10.48-12.12 |
| 12 | గురు శు.సప్తమి పుష్యమి సా4.24-6.33 |
| 14 | శని శు.అష్టమి మఘ ఉ7.24-మ11.05 |
| 14 | శని శు.నవమి మఘ సా4.16-6.25 |
| 14 | శని శు.నవమి మఘ రా8.40-10.48 |
| 16 | సోమ శు.దశమి ఉత్తర ఉ7.35-మ11.58 |
| 16 | సోమ శు.ఏకాదశి ఉత్తర సా4.10-6.19 |
| 16 | సోమ శు.ఏకాదశి ఉత్తర రా8.34-10.42 |
| 18 | బుధ శు.ద్వాదశి హస్త ఉ7.27-10.25 |
| 18 | బుధ శు.ద్వాదశి చిత్ర ఉ10.26-11.37 |
| 18 | బుధ శు.ద్వాదశి చిత్ర సా4.02-6.11 |
| 18 | బుధ శు.త్రయోదశి చిత్ర రా9.17-10.34 |
| 19 | గురు శు.త్రయోదశి చిత్ర ఉ7.23-9.54 |
| 19 | గురు శు.త్రయోదశి చిత్ర ఉ10.48-11.46 |
| 19 | గురు శు.త్రయోదశి స్వాతి రా9.37-10.22 |
| 20 | శుక్ర శు.చతుర్దశి స్వాతి ఉ9.05-11.42 |
| 21 | శని పూర్ణిమ అనూరాధ రా8.14-10.22 |
| 22 | ఆది బ.పాడ్యమి అనూరాధ ఉ7.11-మ11.34 |
| 22 | ఆది బ.పాడ్యమి అనూరాధ రా8.10-10.18 |
| 26 | గురు బ.పంచమి ఉత్తరాషాఢ ఉ7.20-8.50 |
| 26 | గురు బ.పంచమి ఉత్తరాషాఢ ఉ9.07-9.54 |
| 26 | గురు బ.పంచమి ఉత్తరాషాఢ రా7.54-10.02 |
| 27 | శుక్ర బ.షష్ఠి శ్రవణం ఉ9.15-మ11.14 |
| 27 | శుక్ర బ.షష్ఠి శ్రవణం రా7.50-9.58 |
| 28 | శని బ.సప్తమి ధనిష్ఠ ఉ9.35-మ11.10 |
| 28 | శని బ.సప్తమి ధనిష్ఠ రా7.46-9.54 |
| 29 | ఆది బ.అష్టమి శతభిషం ఉ6.43-8.54 |
| 29 | ఆది బ.అష్టమి శతభిషం రా7.42-9.50 |

*Engagements*

## శనిదోష నివారణకు చిరు పరిహారం

అష్టమ శని జరిగే మేషరాశి జాతకులు, అర్ధాష్టమ శని పీరియడ్ నడిచే సింహరాశి జాతకులు, ఏలినాటి శని మూడవ భాగం నడుస్తున్న తులారాశి జాతకులు, ఏలినాటిశని రెండవభాగంలో నున్న వృశ్చికరాశి మరియు ఏలినాటి శని మొదటి భాగం జరుగుచున్న ధనస్సురాశి వారు... ప్రస్తుతం శని మహాదశ నడుస్తున్న జాతకులందరూ... శనిదోష పరిహార నిమిత్తమై ఓ చిరు పరిహారాన్ని పాటిస్తే... మనశ్శాంతితో పాటు ప్రశాంతత కల్గును.

అశ్వని, మఖ, మూల, మృగశిర, చిత్ర, ధనిష్ఠ నక్షత్రాలలో జన్మించిన జాతకులు ఈ పరిహారమును మంగళవారం నాడు ఆచరించాలి. భరణి, పుబ్బ, పూర్వాషాఢ నక్షత్ర జాతకులు శుక్రవారం పరిహారం పాటించాలి. కృత్తిక, ఉత్తర, ఉత్తరాషాఢ నక్షత్ర జాతకులు చిరు పరిహారాన్ని ఆదివారం ఆచరించాలి. రోహిణి, హస్త, శ్రవణా నక్షత్ర జాతకులు చివరలో చెప్పే పరిహారాన్ని సోమవారం పాటించాలి. ఆర్ద్ర, స్వాతి, శతభిషం, పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలలో జన్మించిన జాతకులు ఈ పరిహారమును శనివార రోజులలో ఆచరించాలి. పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్ర జాతకులు గురువారం నాడు, ఆశ్లేష జ్యేష్ఠ, రేవతి నక్షత్ర జాతకులు బుధవారం నాడు పరిహారములను చేయవలసి ఉండును.

మేషరాశి జాతకులకి అష్టమశని 2017 మే 25తో వెళ్లిపోవును. సింహరాశి జాతకులకు కూడా అర్ధాష్టమశని పై రోజుతోనే వెళ్లును. ఇక ఏలినాటి శని మూడవభాగం నడిచే వార్లకు ఇదే తేదీతో ఏలినాటి శని మూడు భాగాలు ముగియును. వృశ్చికరాశిరాశి వారికి, ధనస్సురాశి వారికి మొదటిభాగం కూడా పై తేదీతోనే వెళ్లును. నీరుసున్నం, పసుపు కలిపితే పారాణిగా తయారగును. పైన తెల్పిన నక్షత్రాలలో జన్మించిన జాతకులందరూ... వారికి కేటాయించిన వారముననే ఉదయం 7గంటల తదుపరి కుడిచేతి మధ్యవ్రేలితో పారాణిని ఒక తమలపాకు పైభాగముపై పూర్తిగా రాయాలి. ఆ తర్వాత దానిని ఎండలో కనీసం 12 నిముషాలకు (అరఘడియ కాలము) తగ్గకుండా ఆరబెట్టాలి. 2 గంటల కంటే (5 ఘడియలు) ఎక్కువకాలము ఆరబెట్టవద్దు. ఇలా బాగా ఆరిన తమలపాకును ఇంటిలో గుర్తుగా ఒకస్థానంలో ఉంచేది.

ఆనాటి సాయంత్రం సూర్యాస్తమం తదుపరి ఇంటిలో ఉంచిన పారాణి తమలపాకును ఇంటి బయట చెత్తా చెదారం వేసే కుండిలో పారవేసేది. తిరిగి ఇంటి ముందే పాదాలు నీటితో కడిగి ఇంటిలోనికి ప్రవేశించేది. ఈ ప్రకారంగా అష్టమ, అర్ధాష్టమ, ఏలినాటి శని లేక శనిమహాదశ జరుగుచుంటే అవి వెళ్లేవరకు వారం వారం పాటించేది. ఋతుసమయంలో ఉన్న స్త్రీలు, జాతాశౌచం, మృతాశౌచంలో ఉన్నవారు, గర్భిణులు పాటించవద్దు.

## వధూవరుల వివాహ పొంతనలకు జన్మనక్షత్ర ప్రకారం అనుకూలమైన నక్షత్రాలు

| అశ్వని | భరణి | ★ కృత్తిక 1వపాదం | మఖ | పుబ్బ | ★ ఉత్తర 1వపాదం |
|---|---|---|---|---|---|
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ మృగశిర అశ్వని చిత్ర3,4 (తుల) ధనిష్ఠ ఆర్ద్ర స్వాతి శతభిషం పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి | కృత్తిక ఉత్తర1(సింహం) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల | రోహిణి శ్రవణం మృగశిర చిత్ర3,4 (తుల) ధనిష్ఠ పునర్వసు విశాఖ 1,2,3 (తుల) పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మఖ మూల భరణి పుబ్బ పూర్వాషాఢ | భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) ఆర్ద్ర మృగశిర చిత్ర స్వాతి ధనిష్ఠ3,4 (కుంభం) శతభిషం పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ రేవతి | ఉత్తర కృత్తిక రోహిణి హస్త ఉత్తరాషాఢ1(ధనస్సు) శతభిషం ఆర్ద్ర స్వాతి అశ్వని పునర్వసు విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర1,2,3(కుంభం) మూల ఆశ్లేష మఘ పుబ్బ | హస్త రోహిణి మృగశిర చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) మూల పునర్వసు విశాఖ అశ్వని పుష్యమి పూర్వాభాద్ర1,2,3 (కుంభం) అనూరాధ మఖ భరణి పుబ్బ పూర్వాషాఢ |
| **★ కృత్తిక 2,3,4 పాదాలు** | **రోహిణి** | **★ మృగశిర 1,2 పాదాలు** | **★ ఉత్తర 2,3,4 పాదాలు** | **హస్త** | **★ చిత్ర 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చికం) పూర్వాభాద్ర పుబ్బ పుష్యమి అనూరాధ భరణి ఉత్తరాభాద్ర అశ్వని మఖ | మృగశిర చిత్ర1,2(తుల) ధనిష్ఠ ఆర్ద్ర శతభిషం కృత్తిక పుష్యమి అనూరాధ రోహిణి ఉ.భాద్ర రేవతి ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ ఉత్తర ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) | ఆర్ద్ర శతభిషం పునర్వసు విశాఖ4 (వృశ్చికం) శ్రవణం పూర్వాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ2,3,4 (మకరం) రోహిణి హస్త | హస్త రోహిణి శ్రవణం మృగశిర చిత్ర పునర్వసు ధనిష్ఠ1,2 (మకరం) విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) పుబ్బ పుష్యమి మఖ అనూరాధ మూల ఉత్తరాభాద్ర పూర్వాషాఢ | మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర స్వాతి హస్త పుష్యమి అనూరాధ రేవతి ఉత్తరభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ ఉత్తర ఉ.షాఢ కృత్తిక2,3,4 (వృషభం) | స్వాతి ఆర్ద్ర విశాఖ పునర్వసు పూర్వాభాద్ర4 (మీనం) రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల మఖ ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక2,3,4 (వృషభం) రోహిణి హస్త శ్రవణం చిత్ర |
| **★ మృగశిర 3,4 పాదాలు** | **ఆర్ద్ర** | **★ పునర్వసు 1,2,3 పాదాలు** | **★ చిత్ర 3,4 పాదాలు** | **స్వాతి** | **★ విశాఖ 1,2,3 పాదాలు** |
| ఆర్ద్ర స్వాతి శతభిషం పునర్వసు విశాఖ1,2,3(తుల) పూర్వాభాద్ర ఆశ్లేష రేవతి అశ్వని మఖ మూల ఉత్తర కృత్తిక ఉత్తరాషాఢ1 (ధనస్సు) రోహిణి హస్త | పునర్వసు విశాఖ1,2,3(తుల) ఆర్ద్ర పూర్వాభాద్ర పుష్యమి ఉత్తరాభాద్ర అశ్వని మృగశిర మఖ మూల భరణి పుబ్బ హస్త పూర్వాషాఢ రోహిణి చిత్ర ధనిష్ఠ3,4 (కుంభం) | పుష్యమి ఉత్తరాభాద్ర ఆశ్లేష రేవతి భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ1 (ధనస్సు) చిత్ర మృగశిర ధనిష్ఠ3,4(కుంభం) ఆర్ద్ర స్వాతి శతభిషం | స్వాతి ఆర్ద్ర శతభిషం పునర్వసు ఆశ్లేష విశాఖ పూర్వాభాద్ర1,2,3 (కుంభం) జ్యేష్ఠ అశ్వని మఖ మూల ఉత్తర ఉత్తరాషాఢ కృత్తిక1 (మేషం) హస్త శ్రవణం చిత్ర | విశాఖ పునర్వసు హస్త ధనిష్ఠ మృగశిర3,4 (మిధునం) పూర్వాభాద్ర1,2,3 (కుంభం) పుబ్బ అశ్వని పుష్యమి మఖ అనూరాధ శ్రవణం మూల పూర్వాషాఢ భరణి చిత్ర | పుష్యమి అనూరాధ ఆశ్లేష జ్యేష్ఠ భరణి పుబ్బ స్వాతి పూర్వాషాఢ కృత్తిక1 (మేషం) ఉత్తర ఉత్తరాషాఢ ధనిష్ఠ చిత్ర మృగశిర3,4 (మిధునం) శతభిషం ఆర్ద్ర |
| **★ పునర్వసు 4వ పాదం** | **పుష్యమి** | **ఆశ్లేష** | **★ విశాఖ 4వ పాదం** | **అనూరాధ** | **జ్యేష్ఠ** |
| పుష్యమి అనూరాధ స్వాతి ఉత్తరాభాద్ర ఆశ్లేష జ్యేష్ఠ రేవతి భరణి పుబ్బ కృత్తిక ఉత్తర ఉత్తరాషాఢ2,3,4 (మకరం) మృగశిర చిత్ర ధనిష్ఠ1,2 (మకరం) ఆర్ద్ర | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి అశ్వని మఘ కృత్తిక ఉత్తర పుష్యమి ఉత్తరాషాఢ 2,3,4 (మకరం) రోహిణి హస్త శ్రవణం ఆర్ద్ర స్వాతి పునర్వసు విశాఖ పూర్వాభాద్ర4 (మీనం) | మఘ అశ్వని భరణి పుబ్బ రోహిణి హస్త శ్రవణం చిత్ర పునర్వసు విశాఖ పుష్యమి పూర్వాభాద్ర4 (మీనం) మృగశిర ధనిష్ఠ1,2(మకరం) అనూరాధ ఉత్తరాభాద్ర | అనూరాధ పుష్యమి రేవతి ఉత్తరాభాద్ర పుబ్బ ఆశ్లేష చిత్ర జ్యేష్ఠ పూర్వాషాఢ ఉత్తర స్వాతి విశాఖ ఉత్తరాషాఢ శతభిషం ధనిష్ఠ కృత్తిక2,3,4 (వృషభం) మృగశిర1,2 (వృషభం) | ఆశ్లేష జ్యేష్ఠ రేవతి మఖ మూల కృత్తిక2,3,4(వృషభం) స్వాతి ఉత్తర ఉత్తరాషాఢ రోహిణి హస్త విశాఖ శ్రవణం శతభిషం పూర్వాభాద్ర పునర్వసు (కర్కా) అనూరాధ | మూల మఖ పుబ్బ అనూరాధ పూర్వాషాఢ రోహిణి హస్త చిత్ర శ్రవణం మృగశిర1,2 (వృషభం) ధనిష్ఠ విశాఖ పుష్యమి పునర్వసు4 (కర్కాటకం) పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర |

రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, మఘ, విశాఖ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి అను 8 నక్షత్రములు వివాహాలలో స్త్రీ, పురుషులకు ఒకే నక్షత్రమైనచో శుభప్రదమే కానీ అశుభము కాదు. కనుక పై 8 నక్షత్రముల వారు ఆ నక్షత్ర జాతకులని వివాహం చేసుకొనవచ్చును. అశ్వని, కృత్తిక, మృగశిర, పునర్వసు, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్ర, అనూరాధ, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ అను 11 నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకే నక్షత్రమైనచో మధ్యమ ఫలప్రదమే కానీ నింద్యము కాదు. భరణి, ఆశ్లేష, స్వాతి, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర అను 8 నక్షత్రములు స్త్రీ, పురుషులకు ఒకటైనచో వివాహము చేయరాదు.

# సింహరాశి

శ్రీ మన్మథ : ఆదాయం:8, వ్యయం:14, రాజ్యపూజ్యం:1, అవమానం: 5

శ్రీ దుర్ముఖి : ఆదాయం:11, వ్యయం:5, రాజ్యపూజ్యం:6, అవమానం:3

**జనవరి :** తరచుగా శుభవార్తలు. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. కుటుంబకలహం ఉండదు. హామీలచే గౌరవ ప్రశంసలు పొందగలరు. ఋణ విముక్తికి పరిష్కారం. ఒప్పందాలచే ఆర్థిక లబ్ది. అకారణ విరోధాలు తగ్గును. మౌనానికి అధికప్రాధాన్యత ఇస్తారు. తోబుట్టువులతో లబ్ధి కలదు. జనవరి 14 రాత్రి 10.16 నుంచి 16 అర్ధరాత్రి 1.13 వ్యతిరేకరోజులని గ్రహించాలి.

**ఫిబ్రవరి :** వాగ్దాన భంగములుండవు. ప్రతిబంధకాలకు పరిష్కారాలు అన్వేషిస్తారు. మనోవ్యాకులత తగ్గును. 2వపక్షంలో ప్రశాంతత. మూడవ వారంలో స్వల్ప నమ్మకద్రోహం. మాసాంతంలో నీచ ఆలోచనలకు దూరంగా ఉండాలి. ఆర్థికమాంద్యం తగ్గును. అధర్మకార్యాలను ఆపుదురు. భూ, గృహ మార్పులున్నవి. అనవసర ఆవేశాలకు వెళ్లరు. సెంటిమెంట్‌తో మాసాంతంలో లబ్ధి కలదు. ఫిబ్రవరి 11 ఉదయం 5.41 నుంచి 13 ఉదయం 7.13 వరకు అనుకూలం కాదు.

**మార్చి :** అంచనాలు తారుమారు కావు. స్నేహితుల మనసును గాయపరుచుదురు. మనోసంకటాలతో పోరాటం సాగించవద్దు. కార్యసిద్ధి మాసాంతంలో కల్గును. కీలక నిర్ణయాలలో పైచేయి. శుభకార్యాచరణకు రంగం సిద్ధం. విమర్శలు, అపనిందలు, మాటపట్టింపులు మాసం మధ్యలో కలవు. అధికారులచే వత్తిడి పెరుగును. సంతానంచే 3 వారంలో విజయవార్తలు. మార్చి 9 మధ్యాహ్నం 3.40 నుంచి 11 మధ్యాహ్నం 3.42 వరకు ప్రతికూలం.

**ఏప్రిల్ :** కృతనిశ్చయం బలంగా ఉండదు. బుద్ధిబలంతో నిర్ణయాలుం టాయి. స్పెక్యులేషన్ ఆశాజనకము. కుటుంబకలతలు తగ్గుముఖం. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులు. మాసాంతంలో ఆర్థిక పరిపుష్టి. వాగ్దాన నిర్ణయాలు మారును. రహస్య నిర్ణయాలు బాహాటం చేస్తారు. జాయింటు నిర్వహణలో లోపాలు కనపడును. 2వ వారంలో అంచనాలు తారుమారు కాగల సూచన కలదు. ఏప్రిల్ 5 అర్ధరాత్రి తదుపరి 2.45 నుంచి 7 అర్ధరాత్రి 2.22 వరకు అనుకూల సమయం కాదు.

**మే :** బంధుప్రీతిని స్వాగతిస్తారు. సాహసప్రయత్నాలు ఫలిస్తాయి. ఋణ దాతల వత్తిడి అధికము. 2వపక్షంలో ఊహాగానాలతో పయనిస్తారు. అధికారుల బెడద అధికము. మనోవ్యాకులత్వం తగ్గును. ముఖ్య కార్యరంగాన్ని సిద్ధం చేస్తారు. 3 మధ్యాహ్నం 2.47 నుంచి 5 మధ్యాహ్నం 1.18 వరకు తిరిగి 30 రాత్రి 8.33 నుంచి జూన్ 1 రాత్రి 10.39 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.

**జూన్ :** శీఘ్రనిర్ణయాలు తీసుకుంటారు. వ్యూహాత్మక శక్తులను పెంచుకుం టారు. మనఃశాంతి లభించును. ఇష్టకార్యసిద్ధి, సుఖశాంతులున్నప్పటికీ మాసాంతంలో మనఃక్లేశము. నిరుద్యోగులకు శుభవార్తలు. స్థిరాస్తి నిర్ణయాలలో వాయిదా. సంతాన విజయాలతో సౌఖ్యం. జూన్ 26 అర్ధరాత్రి 2.21 నుంచి 29 ఉదయం 5.38 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలవసరం.

**జూలై :** రోగబాధలు ఉపశమనం. ఋణవత్తిడి పెరుగును. పరనింద ఆరోపణలుండును. సోదరీ వ్యతిరేకం తగ్గును. మాసాంతంలో శతృవులచే మొండి ఏర్పడును. పితృవర్గ పేచీలపై దృష్టి సారిస్తారు. ఆప్తమిత్రుల అండ దండలు మాసాంతంలో లభించును. జూలై 24 ఉదయం 7.52 నుంచి 26 మధ్యాహ్నం 11.06 వరకు ప్రతికూల సమయమని గమనించాలి.

**ఆగస్టు :** శస్త్రచికిత్సకు అవకాశముంది. ధర్మకార్యాలపై శ్రద్ధ పెరుగును. మాసం మధ్యలో అసౌకర్యాలతో విసుగు అధికం. మిత్రభేదములున్నవి. క్షణికావేశముతో ధనవ్యయం. స్థిర ఆలోచనలపై దృష్టి ఉంచుదురు. శుభ కార్యాచరణకు సిద్ధం. ముంజేతి సమస్య పెరుగును. ఆగస్టు 20 మధ్యాహ్నం 2.53 నుంచి 22 సాయంత్రం 4.58 వరకు సమయం అనుకూలం కాదు.

**సెప్టెంబరు :** శక్తికి మించిన కార్యాలు చేపడుదురు. కుటుంబ కలహం ఉండదు. నమ్మినవారిలో శతృవులున్నారని గ్రహిస్తారు. ఆశలు నిరాశలు కావు. ఋణవిషయంలో జాగ్రత్త పడతారు. స్పెక్యులేషన్ యోగించును. మాతృ వర్గీయులచే లబ్ధి. రహస్య అంశాలను బహిర్గతం చేయరు. సెప్టెంబరు 16 రాత్రి 12.09 నుంచి 18 రాత్రి 12.55 వరకు ప్రతికూల సమయం.

**అక్టోబరు :** ఆశాజనక పరిస్థితులు. ఋణ సదుపాయం ఏర్పడును. మానసిక వత్తిడులు, చికాకులు తగ్గును. సామరస్య ధోరణిని అవలంబిస్తారు. దూరప్రయాణాలు లాభించును. వ్యూహాత్మక అంశాలను చేధిస్తారు. అక్టోబరు 14 ఉదయం 10.54 నుంచి 16 మధ్యాహ్నం 11.14 వరకు వ్యతిరేక సమయం.

**నవంబరు :** ప్రతిభకు రాణింపు కలదు. మిత్రశతృత్వాలను గమనిస్తారు. రాజీ ప్రయత్నాలు నెరవేరును. ఉదరలోపం ఏర్పడును. కీలక నిర్ణయాలలో మార్పులు వచ్చును. ప్రేమికులతో వాదోపవాదాలు. పెద్దల నిర్ణయాలను గౌరవించలేరు. నీచ వ్యక్తులకు దూరంగా ఉంటారు. ప్రతిబంధకాలకు పరిష్కారాలు అన్వేషిస్తారు. నవంబరు 10 రాత్రి 9.14 నుంచి 12 రాత్రి 10.31 వరకు అనుకూలం కాదు.

**డిశంబరు:** ఆర్థికనష్టం పూడ్చుకుంటారు. హామీలకై సమయం వృధా చేస్తారు. స్పెక్యులేషన్ స్వల్ప లాభం. శారీరక అలసట అధికం. అంచనాలు మాసం మధ్యలో తారుమారగను. వాగ్ధోరణిలో అసత్యాలు దొర్లును. ఆదాయా నికి మించిన ఖర్చులు. 8 ఉదయం 5.21 నుంచి 10 ఉదయం 8.29 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

PRANATHI TV నిత్యప్రవచకులు...

# కాలచక్రం

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

కాలచక్రం పంచాంగకర్త
త్రికాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత
పండిత శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ

mohan PUBLICATIONS ఆధ్యాత్మిక గ్రంథ నిలయం www.mohanpublications.com

grantha nidhi THE TREASURE OF PAGES www.granthanidhi.com

First Free e - books Android App

Google play · facebook · Buy the E-Books in Kinige.com · dailyhunt

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర వైశాఖ బహుళ ఏకాదశి బుధవారం నుంచి జ్యేష్ఠ బహుళ ఏకాదశి గురువారం వరకు

# 2016 JUNE జూన్

సింహరాశిలో గురువు, రాహువు పుబ్బ నక్షత్రంలో సంచారంచే గురుచండాల యోగ ప్రభావం అధికంగా ఉన్నది. కనుక దక్షిణామూర్తిని నిత్యం ప్రార్థించండి.

### పండుగలు

1 అపరైకాదశి
3 మాసశివరాత్రి
6 జ్యేష్ఠచంద్రోదయం
7 రంజాన్‌నెల ప్రారంభం
8 ఉమాచతుర్థి
9 గురుపుష్యమి
10 ఆరణ్యకగౌరీవ్రతం
12 త్రిలోచనాష్టమి
14 దశపాపహరదశమి
15 మిధునసంక్రాంతి
16 నిర్జలేకాదశి
17 శ్రీశంకర కైలాసగమనం చంపకద్వాదశి
18 శనిత్రయాదశి
20 మహాజ్యేష్ఠి ఏరువాకపున్నమి, పూరీ జగన్నాధుని పున్నమి స్నానం
23 సంకష్టహరచతుర్థి
30 యోగిన్యేకాదశి

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము: సా4.50-5.42<br>రా.కా: సా4.30-6.00 | | **5** ● వైశాఖ<br>అమావాస్య ఉ8.29<br>జ్యేష్ఠశు.పాడ్యమి తె5.25<br>రోహిణిమ12.36 శేషవర్జ్య ఉ 6.52,వ.సా5.42-7.09 | **12**<br>శు.అష్టమి రా2.39<br>పూర్వఫల్గునిమ11.37<br>వ.రా7.36-9.23 | **19**<br>శు.చతుర్దశి మ3.30<br>జ్యేష్ఠ పూర్తిగా<br>వ.ఉ10.16-11.59 | **26**<br>బ.షష్ఠి మ2.20<br>శతభిషం ఉ8.56<br>వ.మ3.08-4.41 |
| **MON సోమ**<br>దుర్ము: మ12.32-1.24<br>మ3.07-3.59<br>రా.కా:ఉ7.30-9.00 | | **6**<br>శు.విదియ రా2.49<br>మృగశిర ఉ10.26<br>వ.సా6.15-7.44 | **13**<br>శు.నవమి తె4.56<br>ఉత్తర మ2.16<br>వ.రా11.43-1.31 | **20**<br>○పూర్ణిమ సా4.32<br>జ్యేష్ఠ ఉ6.05<br>వ.మ2.34-4.15 | **27**<br>బ.సప్తమి మ12.44<br>పూర్వాభాద్ర ఉ8.10<br>వ.సా5.20-6.51 |
| **TUE మంగళ**<br>దుర్ము: ఉ8.13-9.05<br>రా11.00-11.44<br>రా.కా: మ3.00-4.30 | | **7**<br>శు.తదియ రా12.50<br>ఆర్ద్ర ఉ8.46<br>వ.రా8.16-9.48 | **14**<br>శు.దశమి పూర్తిగా<br>హస్త సా5.15<br>వ.రా2.17-4.05 | **21**<br>బ.పాడ్యమి సా5.06<br>మూల ఉ7.31<br>వ.ఉ5.49-7.31<br>వ.సా5.31-7.11 | **28**<br>బ.అష్టమి ఉ10.47<br>ఉత్తరాభాద్ర ఉ7.04<br>రేవతి తె5.38<br>వ.సా6.21-7.51 |
| **WED బుధ**<br>దుర్ము:మ11.39-12.31<br>రా.కా: మ12.00-1.30 | **1**<br>బ.ఏకాదశి రా9.49<br>రేవతి రా10.39<br>వ.మ11.40-1.08 | **8**<br>శు.చవితి రా11.35<br>పునర్వసు ఉ7.45<br>వ.మ3.40-5.15 | **15**<br>శు.దశమి ఉ7.26<br>చిత్ర రా8.20<br>వ.రా2.37-4.25 | **22**<br>బ.విదియ సా5.17<br>పూర్వాషాఢ ఉ8.31<br>వ.సా4.44-6.22 | **29**<br>బ.నవమి ఉ8.31<br>అశ్విని రా3.56<br>వ.రా12.13-1.42 |
| **THU గురు**<br>దుర్ము:ఉ9.56-10.48<br>మ3.06-3.58<br>రా.కా:మ1.30-3.00 | **2**<br>బ.ద్వాదశి సా6.39<br>అశ్విని రా8.16<br>వ.సా4.40-6.07<br>వ.తె4.51 లగాయితు | **9**<br>శు.పంచమి రా11.10<br>పుష్యమి ఉ7.31<br>వ.రా8.37-10.16 | **16**<br>శు.ఏకాదశి ఉ9.54<br>స్వాతి రా11.17<br>వ.తె5.30 లగాయితు | **23**<br>బ.తదియ సా5.04<br>ఉత్తరాషాఢ ఉ9.09<br>వ.మ1.12-2.49 | **30**<br>బ.దశమి ఉ5.58<br>బ.ఏకాదశి రా3.14<br>భరణి రా2.00<br>వ.మ12.45-2.14 |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.12-9.04<br>మ12.31-1.23<br>రా.కా:ఉ10.30-12.00 | **3**<br>బ.త్రయోదశి మ3.16<br>భరణి సా5.42<br>వ.శేషంఉ6.16వరకు<br>వ.తె4.23-5.49 | **10**<br>శు.షష్ఠి రా11.35<br>ఆశ్లేష ఉ8.06<br>వ.రా8.48-10.29 | **17**<br>శు.ద్వాదశి మ12.09<br>విశాఖ రా1.57<br>వ.శేషంఉ7.17వరకు | **24**<br>బ.చవితి సా4.31<br>శ్రవణం ఉ9.25<br>వ.మ1.25-3.00 | 21 జూన్ 2016 పూర్వాభాద్ర నక్షత్ర కుంభలగ్న సమయం రాత్రి 11గంటలకు ఆర్ద్ర కార్తె ప్రవేశించును. నైఋతి ఋతుపవన ప్రభావం అధికంగా ఉన్నప్పటికీ ఎల్‌నినో ప్రభావంచే వర్షములు ఆలస్యము. ఉష్ణోగ్రతలు తారాస్థాయిలో ఉండును. ఆలస్యంగా భారీవర్షములు కలవు. |
| **SAT శని**<br>దుర్ము:ఉ5.37-7.21<br>రా.కా:ఉ9.00-10.30 | **4**<br>బ.చతుర్దశి మ11.49<br>కృత్తిక మ3.05<br>వ.తె5.26లగాయితు | **11**<br>శు.సప్తమి రా12.48<br>మఘ ఉ9.30<br>వ.సా6.12-7.56 | **18**<br>శు.త్రయోదశి మ2.03<br>అనూరాధ తె4.14<br>వ.ఉ6.20-8.05 | **25**<br>బ.పంచమి మ3.36<br>ధనిష్ఠ ఉ9.21<br>వ.సా4.26-6.00 | |

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### జూన్ శుభసమయములు

శ్రీ దుర్ముఖి వైశాఖమాసము

| | | |
|---|---|---|
| 01 | బుధ బ.ఏకాదశి రేవతి | ఉ6.31-10.54 |
| 01 | బుధ బ.ఏకాదశి రేవతి | రా07.30-9.38 |

శ్రీ దుర్ముఖి జ్యేష్ఠమాసము

| | | |
|---|---|---|
| 06 | సోమ శు.విదియ మృగశిర | ఉ6.12-10.25 |
| 08 | బుధ శు.చవితి పునర్వసు | ఉ6.05 -7.45 |
| 08 | బుధ శు.చవితి పుష్యమి | ఉ7.46-10.28 |
| 08 | బుధ శు.చవితి పుష్యమి | రా9.13-11.04 |
| 09 | గురు శు.పంచమి పుష్యమి | ఉ6.01 -7.31 |
| 10 | శుక్ర శు.షష్ఠి మఘ | ఉ9.06-10.20 |
| 10 | శుక్ర శు.షష్ఠి మఘ | సా6.56 -8.47 |
| 11 | శని శు.సప్తమి మఘ | ఉ7.22-9.30 |
| 13 | సోమ శు.నవమి ఉత్తర | ఉ5.45 -10.08 |
| 13 | సోమ శు.నవమి హస్త | సా6.44-10.44 |
| 15 | బుధ శు.ఏకాదశి చిత్ర | ఉ7.50 -10.01 |
| 15 | బుధ శు.ఏకాదశి చిత్ర | మ12.35-సా4.22 |
| 15 | బుధ శు.ఏకాదశి చిత్ర | సా6.37 -8.20 |
| 16 | గురు శు.ఏకాదశి స్వాతి | ఉ7.47-9.54 |
| 16 | గురు శు.ద్వాదశి స్వాతి | సా6.34-10.34 |
| 18 | శని శు.త్రయోదశి అనూరాధ | ఉ8.06 -9.51 |
| 18 | శని శు.త్రయోదశి అనూరాధ | మ11.58-2.02 |
| 18 | శని శు.చతుర్దశి అనూరాధ | సా6.27-8.35 |
| 20 | సోమ పూర్ణిమ మూల | ఉ7.32-9.43 |
| 20 | సోమ పూర్ణిమ మూల | మ11.49-12.34 |
| 20 | సోమ బ.పాడ్యమి మూల | సా6.19-8.27 |
| 22 | బుధ బ.విదియ ఉత్తరాషాఢ | ఉ8.32-9.35 |
| 22 | బుధ బ.విదియ ఉత్తరాషాఢ | మ12.36-1.46 |
| 22 | బుధ బ.తదియ ఉత్తరాషాఢ | సా6.23-8.19 |
| 23 | గురు బ.తదియ ఉత్తరాషాఢ | ఉ7.20-9.09 |
| 23 | గురు బ.తదియ శ్రవణం | మ11.38-1.10 |
| 23 | గురు బ.చవితి శ్రవణం | సా6.07 -10.07 |
| 24 | శుక్ర బ.చవితి శ్రవణం | ఉ7.16-8.15 |
| 24 | శుక్ర బ.చవితి ధనిష్ఠ | మ11.34-12.35 |
| 24 | శుక్ర బ.పంచమి ధనిష్ఠ | సా6.03-10.03 |
| 25 | శని బ.పంచమి శతభిషం | మ11.30-1.34 |
| 27 | సోమ బ.సప్తమి ఉత్తరాభాద్ర | ఉ8.11 -9.15 |
| 27 | సోమ బ.సప్తమి ఉ.భాద్ర | మ11.22-12.35 |
| 29 | బుధ బ.దశమి అశ్విని | సా5.43-9.43 |

*Engagements*

## విద్యలో వెనుకంజలో ఉన్నవారికి ఓ చిన్ని పరిహారం

మతిమరుపు, విద్యలో ఆసక్తి లేకపోవటం, చదివినది గుర్తులేకపోవటం వలన విద్యార్థినీ విద్యార్థులకు అనేక సమస్యలు రావటంతో, తల్లితండ్రులు మనోవేదనకు లోనవుతుంటారు. ఇట్టి తల్లితండ్రులు ప్రతినెలలో పూర్ణిమకు ముందు వచ్చే ఆదివారము మరియు పూర్ణిమ తర్వాత వచ్చే ఆదివారము లేక పూర్ణిమతో కూడిన ఆదివారం నాడు సూర్యోదయం తర్వాత ఉదయం 7గంటల నుంచి 9గంటల మధ్యకాలంలో సరస్వతీ చూర్ణము అరచెంచా మరియు అరచెంచా తేనె రెండు కలిపి ఈ మిశ్రమాన్ని ఎండతగిలే విధంగా ఆరుబయట పెట్టి, 9గంటల తర్వాత ఇంటిలో పెట్టాలి.

తిరిగి ఆదివారం సూర్యాస్తమయానికి 12నిముషాల ముందు సరస్వతీచూర్ణం, తేనె కలిపిన మిశ్రమాన్ని విద్యార్థినీ విద్యార్థులు సేవించిన ఎడల విద్యారంగంలో విశేష ఫలితాలు రాగల సూచన కలదు. అయితే ప్రాంతాల వారీ సూర్యోదయ, సూర్యాస్తమయములు మార్పులు జరుగుతుంటాయి కనుక ఆచరించే ముందురోజు నాటి సూర్యాస్తమ సమయం గమనించి 12 నిముషాల ముందుగా సేవించాలి. ఎంతకాలమైనా చేయవచ్చును.

## ప్రేమానురాగ బంధం పరిఢవిల్లుటకు

భార్యాభర్తలు, అన్నదమ్ములు, అక్కచెల్లెంద్రు, సంతానంతో తల్లితండ్రుల మధ్య ప్రేమానురాగాలు కల్గి, కలహాలకు దారితీయకుండా ఉండటానికి పాటించదగిన పరిహారమున్నది. స్వాతి, ఉత్తరాభాద్ర నక్షత్రాలతో కలిసిన బుధవారము లేదా జ్యేష్ఠ, అనూరాధ నక్షత్రాలతో కలిసిన శుక్రవారము లేదా విశాఖ నక్షత్రంతో కలిసిన శనివారము, లేదా మృగశిర నక్షత్రంతో కొనసాగే ఆదివారం నాడు ఈ పరిహారమును పాటించాలి. పై వారాలలో ఆయా నక్షత్రాలు ఉదయం నుంచి సాయంత్రం వరకు ఉండి ఉన్న రోజులలోని రాహుకాలంలోనే పరిహారం పాటించాలన్నమాట.

ఉదాహరణకు స్వాతి, ఉత్తరాభాద్ర నక్షత్రాలతో కలిసిన బుధవారం రాహుకాలం మధ్యాహ్నం 12 గంటలకు ప్రారంభమగును. ఈ రాహుకాలంలో మొదటి అరగంట, చివరి అరగంట తీసివేయాలి. మధ్యలో ఉన్న అరగంట రాహుకాలంలో... శొంఠిముక్క కొంచెం తీసుకుని దానిని అరగదీయాలి. ఆ గంధంలో రెండు తమలపాకు తొనలు గంధంలో కలపాలి. గంధంలో కలిపి కంఠానికి రాసుకోవాలి. ఈ అరగంటలోనే పైన తెల్పిన వారితో మీరు మాట్లాడాలి. కంఠానికి గంధం పూసుకున్న సమయంలో వ్యక్తి ఎదురుగా ఉండి తీరాలి. ఈ ప్రకారంగా ఆయా నక్షత్రాలు, ఆయా వారాలలో వస్తుంటే దీర్ఘకాలం పాటించండి.

## నక్షత్రవారీగా వివాహమునకు అనుకూల నక్షత్రాలు

| మూల | పూర్వాషాఢ | ★ ఉత్తరాషాఢ 1వపాదం |
|---|---|---|
| భరణి పుబ్బ పూర్వాషాఢ కృత్తిక1(మేషం) ఉత్తర చిత్ర ఉత్తరాషాఢ ధనిష్ఠ రేవతి మృగశిర3,4 (మిధునం) స్వాతి ఆర్ద్ర శతభిషం జ్యేష్ఠ ఉత్తరాభాద్ర అనూరాధ | ఉత్తరాషాఢ ఉత్తర అశ్వని కృత్తిక1 (వృషభం) శ్రవణం హస్త ఆర్ద్ర స్వాతి జ్యేష్ఠ మఖ శతభిషం పునర్వసు 1,2,3 (మిధునం) విశాఖ రేవతి మూల పూర్వాషాఢ పూర్వాభాద్ర | శ్రవణం హస్త చిత్ర భరణి మృగశిర3,4 (మిధునం) ధనిష్ఠ పునర్వసు1,2,3(మిధునం) మఖ పుబ్బ విశాఖ మూల అశ్వని పూర్వాభాద్ర పూర్వాషాఢ అనూరాధ ఉ.భాద్ర ఉత్తరాషాఢ |
| **★ ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు** | **శ్రవణం** | **★ ధనిష్ఠ 1,2 పాదాలు** |
| రోహిణి హస్త శ్రవణం చిత్ర ఉత్తరాషాఢ మృగశిర1,2 (వృష) ధనిష్ఠ పునర్వసు4 (కర్కా) విశాఖ మూల పూర్వాభాద్ర పుష్యమి అనూరాధ పూర్వాషాఢ ఉత్తరాభాద్ర అశ్వని భరణి | ధనిష్ఠ చిత్ర మృగశిర1,2 (వృషభం) కృత్తిక స్వాతి జ్యేష్ఠ శతభిషం పుష్యమి అనూరాధ ఉత్తరాభాద్ర రేవతి ఆశ్లేష భరణి పూర్వాషాఢ శ్రవణం ఉత్తర2,3,4 (కన్య) ఉత్తరాషాఢ | శతభిషం స్వాతి విశాఖ జ్యేష్ఠ పూర్వాభాద్ర పునర్వసు4 (కర్కాటకం) ఆశ్లేష రేవతి అశ్వని మూల కృత్తిక ఉత్తర 2,3,4 (కన్య) ఉత్తరాషాఢ రోహిణి హస్త శ్రవణం |
| **★ ధనిష్ఠ 3,4 పాదాలు** | **శతభిషం** | **★ పూర్వాభాద్ర 1,2,3 పాదాలు** |
| ఆర్ద్ర శతభిషం స్వాతి కృత్తిక పునర్వసు1,2,3 (మిధునం) విశాఖ పూర్వాభాద్ర జ్యేష్ఠ రేవతి అశ్వని మఖ మూల రోహిణి ఉత్తర1 (సింహం) ఉత్తరాషాఢ శ్రవణం | మూల పూర్వాభాద్ర విశాఖ పునర్వసు1,2,3(మిధునం) భరణి మృగశిర అనూరాధ పుబ్బ ఉత్తరాభాద్ర అశ్వని మఖ పూర్వాషాఢ ధనిష్ఠ శ్రవణం రోహిణి చిత్ర3,4 (తుల) | ఉత్తరాభాద్ర అనూరాధ రేవతి జ్యేష్ఠ పుబ్బ పూర్వాషాఢ భరణి కృత్తిక ఉత్తర1 స్వాతి (సింహం) ఉత్తరాషాఢ చిత్ర3,4 (తుల) ధనిష్ఠ మృగశిర ఆర్ద్ర శతభిషం |
| **★ పూర్వాభాద్ర 4వ పాదం** | **ఉత్తరాభాద్ర** | **రేవతి** |
| ఉత్తరాభాద్ర పుష్యమి అనూరాధ ఆశ్లేష ఆర్ద్ర జ్యేష్ఠ రేవతి భరణి పూర్వాషాఢ కృత్తిక ఉత్తర2,3,4 చిత్ర 1,2 (కన్య) ఉత్తరాషాఢ మృగశిర శతభిషం ధనిష్ఠ | రేవతి ఆశ్లేష జ్యేష్ఠ మూల హస్త అశ్వని కృత్తిక ఆర్ద్ర ఉత్తర 2,3,4 (కన్య) ఉత్తరాషాఢ రోహిణి శ్రవణం శతభిషం పునర్వసు ఉత్తరాభాద్ర విశాఖ4(వృశ్చి) పూర్వాభాద్ర | అశ్వని మూల భరణి హస్త పూర్వాషాఢ రోహిణి శ్రవణం మృగశిర చిత్ర1,2 (కన్య) ధనిష్ఠ పునర్వసు విశాఖ4 (వృశ్చి) పూర్వాభాద్ర రేవతి పుష్యమి అనూరాధ ఉ.భాద్ర |

విశాఖ, కృత్తిక, మృగశిర, పునర్వసు, ఉత్తర, చిత్ర, ఉ.షాఢ నక్షత్రాలు స్త్రీ పురుషులకు ఒకటైతే వివాహం చేయవచ్చును. కానీ ఇవి 2 రాశుల సంబంధ నక్షత్రాలు. వీటిలో మొదటిది పురుషరాశిగా, 2వది స్త్రీరాశిగాను భావించాలి. అనగా విశాఖ1,2,3 పాదాలలో జన్మించినవారు పురుషుడు గాను, విశాఖ4వ పాదంలో జన్మించిన వారు స్త్రీ అని భావించాలి.

## నరఘోష నివృత్తికి అద్భుత పరిహారం

నరఘోషతో బాధపడేవారు ఎంతోమంది ఉంటారు. దీని నివృత్తికి తంత్రశాస్త్రరీత్యా అనేక పద్ధతులున్నవి. ప్రత్యేకతిథి వారం కలిసిన రోజులలో ఆచరిస్తే విశేషంగా నరఘోష పరిహార మగును. శుక్లత్రయోదశితో కూడిన సోమవార రాహుకాలం, పూర్ణిమతో కూడిన శనివార రాహుకాలం, శుక్లపంచమితో కూడిన శుక్రవార రాహుకాలం, శుక్లఏకాదశితో కూడిన బుధవార రాహుకాల సమయాలలోనే ఈ పరిహారాన్ని పాటించాలి.

పైన తెల్పిన నాల్గు రోజులకు వారం రోజుల ముందుగానే... నిమ్మకాయను కోసి ఒక పాత్రలో రసం పిండండి. అందులో చిటికెడు ఇంగువను కలపండి. తెలుపు వర్ణంలో ఉన్న చేతి రుమాలు సైజు వస్త్రాన్ని తీసుకుని... ఇంగువ కలిపిన నిమ్మరసంలో ముంచండి. వస్త్రం రసాన్నంతటినీ పీల్చుకుంటుంది. తదుపరి తెలుపు వస్త్రాన్ని నీడలో ఆరనివ్వండి.

పైన చెప్పిన నాల్గురోజుల నాటి రాహుకాల సమయాలకు ఓ గంట ముందుగా... అంతకు ముందే ఆరబెట్టి భద్రపరిచుకున్న తెలుపు వస్త్రంలో ఎండిన కొబ్బరికురిడినీ మూట కట్టండి. ఈ కట్టినమూటకు పసుపు, కుంకుమలు పెట్టవద్దు. ఈ మూటను సింహద్వారానికి గానీ లేక సింహద్వారానికి ముందుండే వరండాలో సీలింగ్‌కు కట్టుకొనండి. కుటుంబంలో ఎవరైననూ దీనిని కట్టవచ్చు. మూట కట్టిన వ్యక్తి పాదప్రక్షాళన తప్పక చేసుకోవాలి. పాటించా ల్సిన నియమాలు ఏమియును లేవు. సహజంగా అధికశాతం గుమ్మడికాయలను కడుతుంటారు. ఆ కట్టే మేకుకే ఈ మూటను కూడా కట్టండి.

ఒకసారి కొబ్బరికురిడి మూటను సీలింగ్‌కు కడితే... దాని ప్రభావం అప్పటినుంచి 11 నెలలు మాత్రమే ఉండును. పై నాల్గు రోజులలో ఏరోజు కట్టిననూ... 11 మాసాల తదుపరి సీలింగ్ నుంచి కొబ్బరికురిడి మూటను విసర్జించటం మాత్రం సోమవారం నాడే చేయాలి. మిగిలిన వారాలలో సీలింగ్ నుంచి తీసి విసర్జించవద్దు.

జాతాశౌచ, మృతాశౌచ దినాలలో వచ్చే తిథి, నక్షత్రరోజులలో ఈ పరిహారమును పాటించవద్దు.

సీలింగ్‌కు కట్టినప్పటినుంచి 11 మాసాలలో... మధ్యకాలంలో ఎప్పుడైనా ఆదివారం అమావాస్య సూర్యగ్రహణం వచ్చినచో.... సోమవారం నాడు ఈ మూటను విసర్జించండి. ఆరోజు అవకాశం లేకపోయినా ఆ తదుపరి సోమవారమైనా విసర్జించండి.

ఈ నరఘోష పరిహారానికి ఆచరించే దాని కాలపరిమితి 11 మాసాలైనప్పటికీ.. ఆదివారం అమావాస్య సూర్యగ్రహణం వస్తే... ఈ వస్త్రంలో ఉండే కొబ్బరికురిడీ... దాని ప్రభావాన్ని కోల్పోవును. చంద్రగ్రహణంతో సంబంధం లేదు. సూర్యగ్రహణమైనందున విసర్జిస్తారు కనుక, మరల పై నాల్గు వారాలు, తిథి కలిసిన రాహుకాల సమయాలలోనే మరో వస్త్రంతో కురిడీని ఇంటిముందు కట్టుకొనాలి. ఆదివారం అమావాస్య సూర్యగ్రహణం భారతదేశంలో కనపడితేనే వర్తించును.

## కన్యారాశి

శ్రీ మన్మధ : ఆదాయం:11, వ్యయం:5, రాజ్యపూజ్యం:4, అవమానం:5

శ్రీ దుర్ముఖి : ఆదాయం:14, వ్యయం:11, రాజ్యపూజ్యం:2, అవమానం:6

**జనవరి :** భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులధికం. మనో సంకటాలు తగ్గును. స్పెక్యులేషన్ ప్రతికూలం..అంచనాలు తారుమారు. కుటుంబ విరోధాలుండును. బంధుసహాయం ఉంటుంది. ఆడంబరాలకు, ఆర్భాటాలకు దూరంగా ఉంటారు. భూ, లావాదేవీలు ఫలించును. జనవరి 16 అర్ధరాత్రి 1.13 నుంచి 19 ఉదయం 4.32 వరకు అనుకూలం కాదని గమనించాలి.

**ఫిబ్రవరి :** ఆరోపణలు, విమర్శలు పట్టించుకోరు. అధికారులచే పూర్ణ లబ్ది. చేదు అనుభవాలుండవు. దినచర్యలో తరచూ మార్పులు. రాజకీయ వాసులకు సమస్యలున్నవి. 3వవారంలో కుటుంబ సమస్యలు గట్టెక్కిస్తారు. మాటలధోరణిలో మార్పులు పెరుగును. నూతన పథకాలను అన్వేషిస్తారు. ఫిబ్రవరి 13 ఉ7.13 నుంచి 15 ఉదయం 9.55 వరకు ప్రతికూల సమయం.

**మార్చి :** అంతర్గత కలహాలుండవు. బంధుప్రీతిలో లోపముండును. 3వ వారంలో అనుకూలతలున్నాయని గ్రహించాలి. స్పెక్యులేషన్‌తో ఆర్థిక నష్టం. అవివాహితులకు శుభ వార్తలున్నవి. ఒప్పందాలు ఫలిస్తాయి. కీలక నిర్ణయాలలో పైచేయిగా ఉంటారు. మార్చి 11 మధ్యాహ్నం 3.42 నుంచి 13 సాయంత్రం 4.42 వ్యతిరేకము.

**ఏప్రిల్ :** శరీరానికి వైద్యసేవలవసరం. జ్ఞాపకశక్తిని పెంచుదురు. అసౌకర్యాలతో విసుగు అధికం. విరోధాలు తగ్గును. స్పెక్యులేషన్ రాణింపు తక్కువ. పాలనానిర్ణయాలు సజావుగా సాగును. ఆరోపణలు ఉండవు. 2వపక్షంలో కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. భూ, గృహ, ధన అంశాలు మెరుగుపడును. ఏప్రిల్ 7 అర్ధరాత్రి 2.22 నుంచి 9 అర్ధరాత్రి 1.57 వరకు అనుకూల సమయం కాదని గమనించాలి.

**మే :** స్వయంవృత్తుల వారికి పూర్ణలబ్ధి. సమయస్ఫూర్తి పెరుగును. విమర్శలు ఉండవు. శస్త్రచికిత్సకు అవకాశం కలదు. నమ్మినవారిలో శత్రువులు ఉంటారు. వాగ్దానాలు భంగము కావు. రానిబాకీలు వసూలగును. సెంటిమెంట్ బలాన్ని పెంచుకుంటారు. అనవసర సంజాయిషీలు అధికమగును. మాసాంతంలో స్థిరాదాయం పెరిగి, ఋణ విముక్తికి మార్గం సుగమం. మే 5 మధ్యాహ్నం 1.18 నుంచి 7 మధ్యాహ్నం 12.42 వరకు సమయం ప్రతికూలమని గ్రహించాలి.

**జూన్ :** ఋణ సదుపాయం ఏర్పడును. కపటస్వభావుల ఆట కట్టిస్తారు. ప్రతిభకు రాణింపు కలదు. మానసిక చికాకులు తగ్గును. ఆశ్రిత పక్షపాతం ఉండదు. స్థిరాస్తులలో జాగ్రత్తలు తీసుకుంటారు. బుద్ధిబలం, మనోబలం పెరుగును. నిర్మాణాత్మక శక్తులను పెంచుకుంటారు. మాసాంతంలో శత్రువుల తాకిడి. జూన్ 1 రాత్రి 10.39 నుంచి 3 రాత్రి 11.02 తిరిగి 29 ఉదయం 5.38 నుంచి జూలై 1 ఉదయం 7.29 వరకు ప్రతికూలం.

**జూలై :** శత్రువులపై విజయం సాధిస్తారు. మానసిక సంఘర్షణలకు దూరంగా ఉంటారు. అనవసర ఖర్చు తగ్గును. నిస్వార్ధ సేవలను తరచూ అందిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠలచే ధనవ్యయం. 2వవారంలో శారీరక అలసట పెరుగును. పిత్రార్జిత అంశాలపై దృష్టి ఉంచుతారు. జూలై 26 మధ్యాహ్నం 11.06 నుంచి 28 మధ్యాహ్నం 1.48 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**ఆగస్టు :** సంకల్పబలం నెరవేరును. విధివిధానాలలో అధికమార్పులు, వ్యూహాత్మక నిర్ణయాలు చేయుదురు. వ్యక్తిగత ప్రతిష్ఠలు పెరుగును. సంతానం చే విజయవార్తలు. బంధుప్రీతిని స్వాగతిస్తారు. వివాద అంశాలు సమసిపోవును. శతృభయం తగ్గును. గౌరవ మర్యాదలు పెరుగును. పరోపకారం, సత్సాంగత్యం సిద్ధించును. మాసాంతంలో వివాదాంశాలు తలదూర్చు అవకాశం కలదు. ఆగస్టు 22 సాయంత్రం 4.58 నుంచి 24 రాత్రి 7.12 వరకు ముఖ్య అంశాలలో జాగ్రత్త అవసరం.

**సెప్టెంబరు :** ప్రతిబంధక వ్యవహారాలు వాయిదా పడును. నరాల, భుజాలతీపు అధికము. ధనం మంచినీళ్ల ప్రాయంగా ఖర్చుపెడుదురు. ప్రయత్న పూర్వకంగా కార్యసిద్ధి. కుటుంబ అన్యోన్యత పెరుగును. హామీ సంతకాలచే సమస్యలుండును. మిత్ర సహాయంతో లబ్ధి కల్గును. సెప్టెంబరు 18 రాత్రి 12.55 నుంచి 20 అర్ధరాత్రి 1.40 వరకు ప్రతికూల సమయం.

**అక్టోబరు :** గృహవాతావరణం అనుకూలము. సాహసనిర్ణయాలపై దృష్టి సారిస్తారు. వ్యూహాత్మక ఆలోచనలు ఫలించును. పాతమిత్రత్వం కోరు కుంటారు. వ్యక్తిగత దూషణలు తగ్గిస్తారు. ఆడంబరాలకు ధనవ్యయం. కళత్రసలహాలను తప్పనిసరిగా స్వీకరిస్తారు. రాజకీయ వాసులకు ఆంతరంగిక సమస్యలు కలవు. అక్టోబరు 16 మధ్యాహ్నం 11.14 నుంచి 18 ఉ10.37 వరకు అనుకూలం కాదు.

**నవంబరు :** శక్తియుక్తులతో కార్యసిద్ధి. లౌకిక విషయాలపై శ్రద్ధ చూపుదురు. పుణ్య కార్యాచరణపై మక్కువ చూపుదురు. వ్యాపార నిర్ణయాలు వాయిదా పడును. స్నేహ సంబంధాలు మెరుగుపడును. పరిష్కారం కాని సమస్యకు మోక్షం కల్గును. విధాన పాలనా నిర్ణయాలు ఆలస్యంగా నడుచును. నవంబరు 12 రాత్రి 10.31 నుంచి 14 రాత్రి 9.39 వరకు వ్యతిరేక సమయం.

**డిశంబరు :** రాజీధోరణితో వెళ్తారు. విమర్శలను ప్రతిఘటిస్తారు. వాగ్ధోరణిని అదుపుచేస్తారు. జాయింట్ వ్యాపారాలు లాభిస్తాయి. స్పెక్యులేషన్ దారి తప్పును. సంతాన అంశాలు సజావుగా సాగును. ఉదరలోపం పెరుగును. డిశంబరు 10 ఉదయం 8.29 నుంచి 12 ఉదయం 8.50 వరకు సమయం ప్రతికూలమని భావించాలి.

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర జ్యేష్ఠమాస బహుళ ద్వాదశి శుక్రవారం నుంచి ఆషాఢమాస బహుళ త్రయోదశి ఆదివారం వరకు

## 2016 JULY జూలై

జూన్ 30వ తేదినుంచి జూలై 11వ తేది వరకు గోదావరీ నదికి అంత్యపుష్కరాలు. కనుక తర్పణ, పిండప్రదానాదులకు అవకాశముంది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| **SUN ఆది**<br>దుర్ము: సా4.56-5.48<br>రా.కా: సా4.30-6.00 | **31**<br>బ.ద్వాదశి ఉ6.30<br>బ.త్రయోదశి తె4.42<br>ఆర్ద్ర రా2.52<br>వ.మ11.58-1.30 | **3**<br>బ.చతుర్దశి సా6.53<br>మృగశిర రా8.06<br>వ.రా3.57-5.27 | **10**<br>శు.షష్ఠి మ3.08<br>ఉత్తర రా10.10<br>వర్జ్యం లేదు | **17**<br>శు.త్రయోదశి తె4.23<br>జ్యేష్ఠ మ1.46<br>వ.రా10.12-11.53 | **24**<br>బ.పంచమి రా9.46<br>పూర్వాభాద్రమ1.37<br>వ.రా10.45-12.16 |
| **MON సోమ**<br>దుర్ము: మ12.37-1.29<br>మ3.13-4.05<br>రా.కా:ఉ7.30-9.00 | | ● **4**<br>జ్యేష్ఠ అమావాస్య సా4.30<br>ఆర్ద్ర సా6.33<br>వర్జ్యం లేదు | **11**<br>శు.సప్తమి సా5.11<br>హస్త రా12.55<br>వ.ఉ7.31-9.19 | **18**<br>శు.చతుర్దశి తె4.40<br>మూల మ3.03<br>వ.మ1.22-3.03<br>వ.రా12.57-2.36 | **25**<br>బ.షష్ఠి రా7.45<br>ఉత్తరాభాద్రమ12.26<br>వ.రా11.46-1.17 |
| **TUE మంగళ**<br>దుర్ము: ఉ8.19-9.10<br>రా11.06-11.50<br>రా.కా: మ3.00-4.30 | | **5**<br>ఆషాఢ శుపాడ్యమి మ2.35<br>పునర్వసు సా5.28<br>వ.ఉ6.01-7.32<br>వ.రా1.19-2.53 | **12**<br>శు.అష్టమి రా7.33<br>చిత్ర రా3.54<br>వ.ఉ9.55-11.43 | ○ **19**<br>పూర్ణిమ తె4.26<br>పూర్వాషాఢ మ3.48<br>వ.రా11.53-1.30 | **26**<br>బ.సప్తమి సా5.36<br>రేవతి మ11.06<br>వర్జ్యం లేదు |
| **WED బుధ**<br>దుర్ము:మ11.46-12.38<br>రా.కా: మ12.00-1.30 | | **6**<br>శు.విదియ మ1.15<br>పుష్యమి సా4.59<br>వర్జ్యం లేదు | **13**<br>శు.నవమి రా9.59<br>స్వాతి పూర్తిగా<br>వ.ఉ10.12-11.59 | **20**<br>బ.పాడ్యమి రా3.45<br>ఉత్తరాషాఢ సా4.04<br>వ.రా8.02-9.38 | **27**<br>బ.అష్టమి మ3.21<br>అశ్విని ఉ9.40<br>వ.ఉ5.55-7.25<br>వ.సా6.41-8.11 |
| **THU గురు**<br>దుర్ము:ఉ10.03-10.54<br>మ3.13-4.05<br>రా.కా:మ1.30-3.00 | | **7**<br>శు.తదియ మ12.37<br>ఆశ్లేష సా5.12<br>వ.ఉ5.54-7.31<br>వ.తె5.41 లగాయితు | **14**<br>శు.దశమి రా12.14<br>స్వాతి ఉ6.52<br>వ.మ1.07-2.54 | **21**<br>బ.విదియ రా2.40<br>శ్రవణం మ3.55<br>వ.రా7.50-9.24 | **28**<br>బ.నవమి మ1.04<br>భరణి ఉ8.11<br>వ.రా7.26-8.56 |
| **FRI శుక్ర**<br>దుర్ము:ఉ8.18-9.09<br>మ12.37-1.29<br>రా.కా:ఉ10.30-12.00 | **1**<br>బ.ద్వాదశి రా12.23<br>కృత్తిక రా11.58<br>వ.మ12.59-2.27 | **8**<br>శు.చవితి మ12.44<br>మఘ సా6.10<br>వ.శేషంఉ7.21వరకు<br>వ.రా2.44-4.27 | **15**<br>శు.ఏకాదశి రా2.08<br>విశాఖ ఉ9.36<br>వ.మ2.00-3.45 | **22**<br>బ.తదియ రా1.16<br>ధనిష్ఠ మ3.25<br>వ.రా10.23-11.55 | ○ **29**<br>బ.దశమి ఉ10.46<br>కృత్తిక ఉ6.41<br>రోహిణి తె5.14<br>వర్జ్యం:రా9.43-11.13 |
| **SAT శని**<br>దుర్ము:ఉ5.42-7.26<br>రా.కా:ఉ9.00-10.30 | **2**<br>బ.త్రయోదశి రా9.33<br>రోహిణి రా9.57<br>వ.మ2.37-4.05<br>వ.రా3.07-4.36 | **9**<br>శు.పంచమి మ1.36<br>పూర్వఫల్గుణి రా7.51<br>వ.రా3.45-5.30 | **16**<br>శు.ద్వాదశి రా3.32<br>అనూరాధ మ11.57<br>వ.సా5.58-7.41 | **23**<br>బ.చవితి రా11.37<br>శతభిషం మ2.38<br>వ.రా8.46-10.18 | **30**<br>బ.ఏకాదశి ఉ8.33<br>మృగశిర రా3.56<br>వ.ఉ10.32-12.03 |

### పండుగలు

1. కూర్మజయంతి
2. మాసశివరాత్రి శనిత్రయోదశి
5. ఆషాఢచంద్రోదయం
6. షవ్వాల్‌నెల ప్రారంభం రంజాన్‌పండుగ పూరీజగన్నాథరథయాత్ర
7. తెలంగాణాబోనాలారంభం
9. స్కంధపంచమి
10. కుమారషష్ఠి,భానుషష్ఠి
11. వివస్వతసప్తమి
13. శుక్రమౌఢ్యత్యాగం
14. దధివ్రతారంభం
15. తొలిఏకాదశి
16. వాసుదేవద్వాదశి కర్కాటకసంక్రమణం ఉ10.15ని॥లకు దక్షిణాయనప్రారంభం
19. గురుపూర్ణిమ,మహాషాఢి
22. ఆడిపదినెట్టు
23. సంకష్టహరచతుర్థి
24. సికింద్రాబాద్ మహంకాళీ జాతర
29. ఆడికృత్తిక
30. కామికాఏకాదశి

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

### జూలై శుభసమయములు

శ్రీ దుర్ముఖి ఆషాఢమాసము

| | |
|---|---|
| 06 | బుధ శు.విదియ పుష్యమి ఉ6.30-8.41 |
| 06 | బుధ శు.విదియ పుష్యమి ఉ10.48 -11.45 |
| 07 | గురు శు.చవితి మఘ సా5.14-7.22 |
| 08 | శుక్ర శు.చవితి మఘ ఉ7.22-8.18 |
| 08 | శుక్ర శు.చవితి మఘ ఉ10.41- మ12.37 |
| 08 | శుక్ర శు.పంచమి మఘ సా5.10- 6.10 |
| 09 | శని శు.షష్ఠి ఉత్తర రా7.52-9.06 |
| 10 | ఆది శు.షష్ఠి ఉత్తర ఉ6.15-8.26 |
| 10 | ఆది శు.షష్ఠి ఉత్తర ఉ10.33-12.37 |
| 10 | ఆది శు.సప్తమి ఉత్తర సా5.50-9.02 |
| 11 | సోమ శు.సప్తమి హస్త ఉ6.11-7.30 |
| 11 | సోమ శు.సప్తమి హస్త ఉ10.29-12.32 |
| 11 | సోమ శు.సప్తమి హస్త సా4.58-5.11 |
| 13 | బుధ శు.నవమి స్వాతి ఉ6.03-8.14 |
| 13 | బుధ శు.నవమి స్వాతి సా4.50-8.50 |
| 15 | శుక్ర శు.ఏకాదశి అనూరాధ ఉ10.12- 12.17 |
| 15 | శుక్ర శు.ఏకాదశి అనూరాధ సా4.42- 8.42 |
| 16 | శని శు.ద్వాదశి అనూరాధ ఉ7.31-8.02 |
| 16 | శని శు.ద్వాదశి అనూరాధ ఉ10.09-11.56 |
| 17 | ఆది శు.త్రయోదశి మూల సా6.43-8.34 |
| 18 | సోమ శు.చతుర్దశి మూల ఉ10.00- మ12.38 |
| 20 | బుధ బ.పాడ్యమి ఉత్తరాషాఢ ఉ9.53- 11.47 |
| 20 | బుధ బ.పాడ్యమి శ్రవణం సా6.31- 8.00 |
| 21 | గురు బ.విదియ శ్రవణం ఉ10.57- మ2.03 |
| 21 | గురు బ.విదియ ధనిష్ఠ సా6.27 -7.49 |
| 22 | శుక్ర బ.తదియ ధనిష్ఠ ఉ9.45- మ12.38 |
| 22 | శుక్ర బ.తదియ శతభిషం సా6.23-8.14 |
| 22 | శుక్ర బ.తదియ శతభిషం రా9.54-10.22 |
| 23 | శని బ.చవితి శతభిషం ఉ9.41-12.39 |
| 24 | ఆది బ.పంచమి ఉత్తరాభాద్ర సా6.15- 8.06 |
| 25 | సోమ బ.షష్ఠి ఉత్తరాభాద్ర ఉ9.33-12.26 |
| 25 | సోమ బ.షష్ఠి రేవతి సా6.12-7.45 |
| 29 | శుక్ర బ.దశమి రోహిణి ఉ9.16-10.46 |
| 29 | శుక్ర బ.ఏకాదశి రోహిణి సా5.55-7.46 |

*Engagements*

## రాహునక్షత్రాల మధ్య పూర్ణిమన సంతానాభివృద్ధి

మాసంలో తులారాశిలోని స్వాతి నక్షత్రం నుంచి, కుంభరాశిలోని శతభిషా నక్షత్రం వరకు గల రోజులలో పూర్ణిమ తిథి వచ్చినరోజున సంతానాన్ని అభివృద్ధి దిశలో తీసుకుని వెళ్లుటకు అద్భుతమైన పరిహారం కలదు. దీనిని ప్రతి కుటుంబం వారు ఎన్ని మార్లయిననూ ఆచరించవచ్చును. కేవలం వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణమాసాల పూర్ణిమ తిథి స్వాతి మరియు శతభిషా నక్షత్రాల మధ్యన వస్తుంది. కానీ ఈ పూర్ణిమ తిథి స్వాతితో ఉండకూడదు, శతభిషంతో ఉండకూడదు. ఈ రెండింటి మధ్యనే రావాలి. ఒక్కోసారి వైశాఖమాసం రావచ్చును. రాకపోవచ్చును. స్వాతి రాహునక్షత్రమై ఒకే నక్షత్రంతో కూడి ఇంద్రనీలమణి వలె ఉంటుంది. అలాగే శతభిషం రాహునక్షత్రమై వందనక్షత్రాల కలయికతో పుష్పాకారంతో ఉంటుంది. శతభిషం ఉండే కుంభరాశి శని యొక్క స్వక్షేత్రం. స్వాతి ఉండే తులారాశి శని ఉచ్ఛ క్షేత్రం. కుంభరాశి నుంచి తులకు, తులారాశి నుంచి కుంభానికి నవపంచక స్థానాలతో ఉన్నది. ఈ రెండు రాశులు శనిగ్రహానికి సంబంధించి, ఒక్కోరాశిలో 3 గ్రహ నక్షత్రాలు ఉంటూ... ఆయా రాశులకు అటువైపు, ఇటువైపు రాశులతో సంబంధం ఉన్న రాశులు ఈరెండు మాత్రమే. ఈ రెండురాశులకు మధ్య స్థానంలో నాల్గు పాదాలతో విరాజిల్లే నక్షత్రాలే స్వాతి, శతభిషం. తమ బిడ్డలు దిన దిన ప్రవర్ధమానమై నీలమణివలె ప్రకాశిస్తూ వందతారలు కలిసిన పుష్పంలా వికసించాలని కోరుకుంటారు. అట్టివారలకు ఈ దిగువన ఓ అద్భుత పరిహారం ఉన్నది. ఈ పరిహారాన్ని ప్రతి సంవత్సరం ఉత్తరాయనానికి చివరలో దక్షిణాయనానికి ముందుగా ఉంటూ వసంత, గ్రీష్మ, వర్షఋతువులలో వచ్చే పూర్ణిమలు అవసరం. అవే వైశాఖంలో మహావైశాఖి, జ్యేష్ఠమాసంలో మహాజ్యేష్ఠి, ఆషాఢంలో మహాషాఢి, శ్రావణంలో మహాశ్రావణం. ఈ నాల్గు పర్వదినాలలో వారం ఏదైనప్పటికీ, ఆనాటి రాహుకాలాలను తీసుకొనండి. ముఖ్యంగా తల్లితండ్రులలో ఒకరు ఆచరించాలి. ఈ రాహుకాలాలలో పూర్తి సమయం మౌనంగా ఉండాలి. ఈ రాహుకాలం మధ్యలో కాఫీ, టీ ఇతర ఘనపదార్థాలు ఏమి తినకుండా ఉండాలి. మంచి నీరు తాగవచ్చును. రాహుకాలం మధ్యలో 9 నిమిషాల పాటు తేనె కలిపిన గోరువెచ్చని కప్పు పాలపై కుడి అరచేతిని మూసి శ్రీ లలితా సహస్రనామ స్తోత్రంలోని 179వ శ్లోకాన్ని 16 పర్యాయాలు పఠించి, చేయితీసి, అదే సమయంలోనే మౌనం పాటించేవారే త్రాగి... మౌనాన్ని కొనసాగించాలి. ఇతర నియమాలు ఏమీ లేవు. అన్నీ పనులు చేసుకుంటూ మౌనం పాటించవచ్చును. మధ్యాహ్నం తదుపరి వచ్చే రాహుకాల సమయాలలో కూడా ముందు భోజనం చేయవచ్చును.

## అదృష్ట దోషాలు - వివరణ

జాతక పరిశీలనలో కొన్ని దోషాలుంటే వెంటనే చెప్పగలుగుతారు. కొన్ని దోషాల విషయంలో జన్మ సమయానికి 40 రోజుల ముందున్న గ్రహస్థితిని పరిశీలించినపుడు మాత్రమే, అదృష్టదోషాలు జాతకచక్రంలో ఉన్నట్లుగా తెలుస్తాయి. కంటికి వెంటనే కనపడే దోషాలను దృష్టదోషాలు అంటారు. (దృష్టము అనగా కనపడునని అర్థము.) అలాకాక కంటికి కనపడకుండా ఉండే దోషాలను (దృష్టము కాకుండా) అదృష్టదోషాలని అంటారు.

అదృష్టమనగానే సహజధోరణిలో లక్ అని భావిస్తారు. అదృష్టము అంటే దృష్టము కానిదని, (కంటికి కనపడదని) అర్థం. 25 సంవత్సరాలకే వివాహయోగమని చెప్పు సందర్భాలలో... అసలు జీవితకాలంలో వివాహం కాకుండా ఉండటము.. వివాహం అసలు కాదనుకున్న వారికి వివాహం కావటం, అలాగే సంతాన అంశాలలో కూడా ఫలితాలు తారుమారు కావటం జరుగుతున్నది. ఈ విధంగా పండితులు చెప్పిన అనుకూల ఫలితాలకు, వ్యతిరేకంగా జరగటము... ప్రతికూల ఫలితాలకు బదులుగా జాతకులకు అనుకూల ఫలితాలు పొందటము జరుగుతున్నవి. ఇక్కడ పండితులనే తప్పు పడుతుంటారు.

పురాతన తాళపత్ర గ్రంధాలలో నిక్షిప్తమై ఉన్న జ్యోతిశ్శాస్త్ర రహస్యాలు ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయి. ఈ అదృష్టదోషాలనేవి చనిపోయిన పెద్దల (పితృదేవతల) నుంచి సంక్రమిస్తుంటాయి. భారతీయ సంప్రదాయంలో...ఓ వ్యక్తి చనిపోతే... చనిపోయిన వ్యక్తి ఆత్మశాంతి కల్గటానికి... తన సంతతి ప్రతి సంవత్సరం, ఆబ్దికములు (శ్రార్ధము లేక తద్దినము లేక పితృకార్యము) ఆచరిస్తుంటారు. మకరసంక్రాంతి పర్వదినాలలోను, మహాలయం లోను, విశేషదినాలలో నదీ ప్రాంతాలలో తర్పణ పిండ ప్రదానాదులను ఇస్తుంటారు. శాస్త్రనిర్దేశానుసారం... మరణించిన వ్యక్తి ఆత్మశాంతి కోసం సంవత్సరానికి 96 పర్యాయ ములు ఆబ్దికములను వారి సంతతి ఆచరించాలి. ఇలా ఆచరించేవారు అత్యల్పము.

పైవిధంగా 96 ఆబ్దికాలను ఆచరిస్తే... పితరులు సంతసించి పరిపూర్ణంగా తమ ఆశీస్సులను సంతతికి అందిస్తారనేది భారతీయుల నమ్మకం. ఇది నమ్మకమే కాదు... నగ్నసత్యం కూడా. ఓ వ్యక్తి జీవితకాలంలో దానాలు, ధర్మాలు ఆచరిస్తూ ప్రజలకి సేవలనం దిస్తూ కీర్తి ప్రతిష్ఠలతో మరణించాడనుకుందాం. తన మరణానంతరము ఆ వ్యక్తికి కల్గిన సంతానానికి.. పూర్తిగా వ్యతిరేకతలు ఉంటూ ప్రజలచే ఛీత్కారములు పొందుతూ ఋణ, రోగ, శత్రు భయాలతో పాటు పలు సమస్యలను ఎదుర్కొంటుంటారు.

మరోవ్యక్తి జీవితకాలంలో ప్రజలకు మేలు చేయక కీడు తలపెడుతూ మోసాలు, దోపిడీలు, హత్యలు, అసత్యాలతో కాలయాపన చేస్తూ దారుణ మరణాన్ని పొందాడను కుందాం. ఈ వ్యక్తి సంతానం ప్రజలచేతను, ప్రభుత్వాల చేతను పలు ప్రశంసలు పొందుతుంటారు.

ఇంకో వ్యక్తి జీవితకాలంలో అన్యాయాలు, అక్రమాలు చేస్తూ హింసామార్గంలోనే కాలం చేస్తాడు. ఈ వ్యక్తి సంతానంలో కొంతమంది ఆణిముత్యాలున్నారు, మరికొందరు దారుణ దారిద్ర్యంలో మగ్గుతూ.. బ్రతుకుబండిని ఈడుస్తుంటారు.

ఇంకొక వ్యక్తి జీవితకాలంలో విశేష సేవలు ప్రజలకు అందించినందున ధర్మాత్ములుగా ప్రత్యక్ష దైవంగా ప్రశంసలు అందుకుంటూ చివరికి కాలం చేసిన తదుపరి, వారి సంతతిలో వివాహాలు కాకుండా, చదువుసంధ్యలు లేకుండా, ఋణ, రోగ, శత్రుబాధలతో ప్రజలచే దండింపబడుతూ, చెరసాలలో శిక్ష అనుభవిస్తుంటారు.

**పై ఉదాహరణలలో... అలా జరగటానికి కారణాలు ఏమిటి? అవే అదృష్టదోషాలు**

ఒక కుటుంబంలో తల్లి, తండ్రి, మేనమామ, మేనత్త, తాత, అమ్మమ్మ,బామ్మ, బాబాయి, పెదనాన్న.. ఇలా ఇలా ఉన్నవారు మరణించి ఉన్నారనుకుందాం. వారి మరణం తదుపరి... పితృదోషాలు సంతతికి వ్యాపిస్తూ ఉంటాయి. ఈ దోషాలనే అదృష్టదోషాలు అంటారు.

పితరుల నుంచి అనుకూల ఫలితాలు వచ్చే అవకాశాలు సంతతికి ఉన్నప్పటికీ, ఆ అనుకూల ఫలితాలను పొందకుండా అడ్డుపడే గ్రహస్థితులనే అదృష్టదోషాలు అంటారు. అలా కాక పితరుల నుంచి ప్రతికూల ఫలితాలు వచ్చే అవకాశాలు సంతతికి ఉన్నప్పటికీ ఆ ప్రతికూల ఫలితాలను జాతకులు అనుభవించకుండా గ్రహస్థితులు అడ్డుపడి చక్కని విశేష శుభఫలితాలను ఇచ్చే అవకాశాలు కూడా ఈ అదృష్టదోషాల ద్వారానే వస్తుంటాయి.

దీనిని బట్టి తెలుసుకోవలసినది ఏమిటంటే ప్రతివారి జాతకాలలో అదృష్టదోషాలంటూ తప్పక ఉండును. పితరుల ద్వారా వచ్చే అనుకూల ఫలితాలను ఆకర్షించే గ్రహస్థితి జాతకులకు ఉండి తీరాలి. లేక పితరుల నుంచి వచ్చే వ్యతిరేక ఫలితాలను వికర్షించే గ్రహస్థితులైనా జాతకులకు ఉండి తీరాలి. మరి ఈ ఆకర్షణ, వికర్షణ గ్రహస్థితులను తెలుసుకొని, తగిన పూర్తిస్థాయి పరిహారాలను సంవత్సరం పొడవునా పాటించినప్పుడే జాతకులు శుభకరమైన స్థితులను పొందుతూ ముందుకు వెళ్లగలుగుతారు.

ఈ అదృష్టదోషాలను పరిహారం చేయుటకు చేసే ప్రక్రియ ఆషామాషీ కాదు. వేదోక్తంగా, శాస్త్రీయంగా ఆచరించినప్పుడే పితరుల నుంచి అనుకూల ఫలితాలు వస్తాయి. పితరులు మంచి లేక చెడు చేసి మరణించినా.. వారి వారి సంతతికి అనుకూల ఫలితాలు రావటానికి చేసే వైదిక ప్రక్రియే ఈ అదృష్టదోష పరిహారం. ప్రతినెలలో వచ్చే సంక్రమణం రోజు, ఆనాటి దిన నక్షత్రము, ఆనాటి వారము మరియు గ్రహస్థితిని బట్టి, సంతతి యొక్క జాతక స్థితులను బట్టి ఈ అదృష్ట దోషాలకు పూర్తిస్థాయి పరిహారాలుండును. అందుకే నా సారధ్యంలో ఈ అదృష్టదోషాలకు శాస్త్రీయమైన పరిహారక్రియలు త్వరలో ప్రారంభం కాబోతున్నాయి. పూర్తివివరాలకు grahabhumi.blogspot.com లో చూసి తెలుసుకోగలరు.

## తులారాశి

శ్రీ మన్మథ : ఆదాయం:8, వ్యయం:8, రాజ్యపూజ్యం:7, అవమానం: 1

శ్రీ దుర్ముఖి : ఆదాయం:11, వ్యయం:4, రాజ్యపూజ్యం:5, అవమానం:6

**జనవరి :** ఆశాజనకమాసం. వృధా ప్రయాణాలుండవు. విమర్శలకు అపనిందలకు దూరం. చంచలత్వం తగ్గును. హామీ ప్రయత్నాలు చేయరు. శరీరతేజస్సు, ఆలోచనా పటిమ పెరుగును. సహచరులతో స్వల్ప అభిప్రాయ బేధాలు. మాసాంతంలో శరీర శ్రమ అధికం. న్యాయస్థాన లావాదేవీలు ఉపశమనం. జనవరి 19 ఉదయం 4.32 నుంచి 21 ఉదయం 8.36 వరకు ప్రతికూలం.

**ఫిబ్రవరి :** వివాద అంశాలుండవు. ప్రయత్నంచే కార్యసిద్ధి. ఆర్భాట వ్యవహారాలకు దూరం. మనోవాంఛలు నెరవేరును. వృత్తిపర లోపాలను సరిచేసుకుంటారు. శుభ కార్యచర్చలు సఫలం. హడావుడి నిర్ణయాలు తీసుకోరు. తోబుట్టువుల మధ్య అంగీకారం కుదురును. సమయస్ఫూర్తిని పాటిస్తారు. మాసాంతంలో ఆర్థికపరిపుష్టి కల్గును. ఫిబ్రవరి 15 ఉదయం 9.55 నుంచి 17 మధ్యాహ్నం 2.22 వరకు వ్యతిరేకము.

**మార్చి :** రహస్యనిర్ణయాలు బాహాటం చేస్తారు. పరనింద ఆరోపణలు అధికము. కుటుంబ ప్రశాంతత. ఋణప్రయత్నాలు ఫలించును. ప్రతిబంధక సమస్యలు తొలగును. మోకాళ్లతీపు పెరుగును. మిత్రశతృత్వాలు గమనించలేరు. రాజీధోరణి ఉండును. గృహనిర్మాణ పనులు శ్రద్ధగా ఆచరిస్తారు. వాహన మరమ్మత్తులకు ధనవ్యయం.మార్చి 13 సాయంత్రం 4.42 నుంచి 15 రాత్రి 8.03 వరకు అనుకూల సమయం కాదు.

**ఏప్రిల్ :** గుప్త సమాచారం సేకరిస్తారు. శుభసంకేతాలుండును. ఆర్థిక మాంద్యం ఉండదు. శతృవులపై విజయం సాధిస్తారు. స్వవృత్తుల వారికి ఆశాజనకం. ముఖ్య ప్రయాణాలు లాభించును. పాదాలకు రుగ్మత రాగల సూచన. చలాకీతనం కళాకాంతులు పెరుగును. వాగ్ధోరణిలో నూతన నిర్ణయాలు. స్నేహిత బాధ్యతను స్వీకరించలేరు. ఏప్రిల్ 9 అర్ధరాత్రి 1.57 నుంచి 11 అర్ధరాత్రి 3.33 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి.

**మే :** భాగస్వామ్య చర్చలు నెరవేరును. మాతృవర్గీయులచే లబ్ధి. కీర్తి ప్రతిష్ఠలను రక్షించుకుంటారు. ధనక్షయానికి అడ్డుకట్ట వేస్తారు. వాతరోగ బాధలు 2వపక్షంలో అధికం. వేధింపు జనుల విమర్శలను తట్టుకుంటారు. రాజీధోరణిని అవలంబిస్తారు. సంతానం తప్పుదారి పట్టకుండా జాగ్రత్త పడుదురు. స్పెక్యులేషన్ రాణించదు. మే 7 మధ్యాహ్నం 12.42 నుంచి 9 మధ్యాహ్నం 1.08 వరకు ప్రతికూల సమయం.

**జూన్ :** ఋణభారం పెరుగును. స్పెక్యులేషన్‌లో అపజయం. వాగ్ధాన భంగము లుండును. సామర్థ్యం లేని వ్యక్తులచే విమర్శలు. వ్యూహాత్మక అంశాలు కలిసిరావు. గర్వభంగములున్నవి. అవివాహితులకు స్వల్పంగా శుభవార్తలు. మిత్రశతృత్వాలను గమనించలేరు. దైవకార్యాచరణపై ఆసక్తి మెండు. జూన్ 3 రాత్రి 11.02 నుంచి 5 రాత్రి 11.31 వరకు ప్రతికూల వాతావరణముండునని భావించాలి.

**జూలై :** ఆర్థికనష్టం పూడ్చుకుంటారు. ఋణసమస్యలు స్వల్పంగా తగ్గును. మాసాంతంలో స్థానచలన సూచనలు. అంచనాలు వాస్తవరూపం దాల్చవు. మనో సంకటాలు అధికమగును. పూచీకత్తుకై సంతకాలు వద్దు. శుభచర్చలలో పాల్గొని పితృవర్గం వారిని సంతోషపెడుదురు. ప్రత్యేక ప్రతిపత్తిని సఫలం చేసుకుందురు. జూలై 1 ఉదయం 7.29 నుంచి 3 ఉదయం 9.01 వరకు తిరిగి 28 మధ్యాహ్నం 1.48 నుంచి 30 సాయంత్రం 4.35 వరకు వ్యతిరేకసమయంగా భావించాలి.

**ఆగస్టు :** ఆశాజనకంగా మాసం గడిచిపోవును. హామీ ప్రయత్నాలు నెరవేరును. కుటుంబ సమస్యలు సర్దుమణుగును. నూతన అగ్రిమెంట్లు కలిసివచ్చును. వివాదాలు ఉండవు. స్వయంవృత్తుల వారికి పూర్తి అనుకూలం. సాహసప్రయత్నాలు ఫలిస్తాయి. కల్పనాశక్తి పెరగటంతో ఆర్థికలబ్ధి. ఆగస్టు 2 రాత్రి 7.12 నుంచి 26 రాత్రి 10.23 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**సెప్టెంబరు :** అధికారుల బెడద ఉండదు. కృతనిశ్చయం బలంగా ఉండును. వ్యూహాత్మక శక్తి పెరుగును. ఆత్మవిశ్వాసం పెరుగును. దైవకార్యాలపై ఆసక్తి పెరుగును. గృహనిర్మాణ పనులు శ్రద్ధగా ఆచరిస్తారు. మాసం మధ్యలో స్వల్పంగా మనఃక్లేశములు. శరీర, మానసిక వత్తిడులు మాసాంతంలో తగ్గును. సెప్టెంబరు 20 అర్ధరాత్రి 1.40 నుంచి 23 అర్ధరాత్రి 3.02 వరకు సమయం ప్రతికూలమని భావించాలి.

**అక్టోబరు :** వినోదకాలక్షేపాలు అధికం. స్థిరాస్తి నిర్ణయాలలో వాయిదా. నిర్ణయాలను నిర్భయంగా చెప్పగలరు. శరీరానికి వైద్యసేవలు అవసరం. సమయస్ఫూర్తి లోపించును. కార్యదీక్షాబాధ్యత పెరుగును. తోబుట్టువులతో స్వల్ప విరోధం. లోభగుణం తగ్గించండి. స్వయంరంగాల వారికి లబ్ధి. ఉద్యోగులపైన నిఘా కలదు. అక్టోబరు 18 ఉ10.37 నుంచి 20 మధ్యాహ్నం 11.11 వరకు అనుకూలం కాదు.

**నవంబరు :** ఆప్తమిత్రుల అండదండలు అధికం. ఆశలు నిరాశలు కావు. అధర్మ కార్యాలవైపు వెళ్లరు. వ్యక్తిగత విమర్శలు చేయరు. వ్యాపార అంశాలలో పావులు కదుపుతారు. నూతన విధి విధానాలచే విజయప్రాప్తి. ఉన్నత వ్యక్తులచే కార్యసిద్ధి. పుణ్యకార్యాచరణపై మక్కువ పెరుగును. నవంబరు 14 రాత్రి 9.39 నుంచి 16 రాత్రి 8.59 వరకు వ్యతిరేక సమయమని గమనించాలి.

**డిశంబరు :** రోగబాధలు ఉపశమనం. స్థిరలావాదేవీలలో లోపాలు సడలును. స్పెక్యులేషన్ యోగింపు. శుభకర చర్చలచే లబ్ధి. బంధుప్రీతిచే కార్యలాభం. పరువు, ప్రతిష్ఠలను పెంచుకుంటారు. వ్యూహాత్మక నిర్ణయాలతో సమస్యలు ఛేదిస్తారు. సంతానంచే శుభవార్తలు. డిశంబరు 12 ఉదయం 8.50 నుంచి 14 ఉదయం 8.16 వరకు ప్రతికూలం.

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర ఆషాఢమాస బ.చతుర్దశి సోమవారం నుంచి శ్రావణమాస బహుళ చతుర్దశి బుధవారం వరకు

## 2016 AUGUST ఆగస్టు

కృష్ణా పుష్కరాలు జరిగే 12 రోజులలో తర్పణ, పిండప్రదానాదులతో పాటు శక్త్యానుసారము, ఇష్టానుసారము దానములు చేయవచ్చును. నియమము లేదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.51-5.42<br>రా.కా: సా4.30-6.00 | ఆగస్టు 12 నుంచి కృష్ణా పుష్కరాలు ప్రారంభం | **7**<br>శు.పంచమి పూర్తిగా<br>ఉత్తర ఉ6.29<br>వ.మ3.47-5.33 | **14**<br>శు.ఏకాదశి సా5.32<br>మూల రా11.47<br>వ.ఉ6.49-8.31<br>వ.రా10.05-11.47 | **21**<br>బ.తదియ ఉ8.17బ.చవితి తె5.43 ఉ.భాద్రసా6.46<br>వ.శేషంఉ6.53వరకు<br>వ.తె5.52లగాయితు | **28**<br>బ.ఏకాదశి మ3.21<br>ఆర్ద్ర ఉ9.18<br>వ.రా9.11-10.46 |
| MON సోమ<br>దుర్ము: మ12.39-1.30<br>మ3.11-4.02<br>రా.కా:ఉ7.30-9.00 | **1**<br>బ.చతుర్దశి రా3.14<br>పునర్వసు రా2.09<br>వ.మ2.31-4.04 | **8**<br>శు.పంచమి ఉ5.58<br>హస్త ఉ9.01<br>వ.సా5.59-7.46 | **15**<br>శు.ద్వాదశి సా5.49<br>పూర్వాషాఢరా12.34<br>వ.ఉ9.42-11.21 | **22**<br>బ.పంచమి రా3.09<br>రేవతి సా4.58<br>వ.శేషంఉ7.21వరకు | **29**<br>బ.ద్వాదశి మ2.29<br>పునర్వసు ఉ9.03<br>వ.సా5.06-6.43 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.24-9.15<br>రా11.06-11.51<br>రా.కా: మ3.00-4.30 | ● **2**<br>ఆషాఢఅమావాస్యరా2.14<br>పుష్యమి రా1.52<br>వ.ఉ10.03-11.38 | **9**<br>శు.షష్ఠి ఉ8.14<br>చిత్ర మ11.53<br>వ.సా6.11-7.59 | **16**<br>శు.త్రయోదశి సా5.26<br>ఉత్తరాషాఢరా12.43<br>వ.ఉ8.37-10.14<br>వ.తె4.39 లగాయితు | **23**<br>బ.షష్ఠి రా12.38<br>అశ్విని మ3.13<br>వ.మ11.30-12.59<br>వ.రా12.09-1.39 | **30**<br>బ.త్రయోదశి మ2.02<br>పుష్యమి ఉ9.13<br>వ.రా10.20-11.58 |
| WED బుధ<br>దుర్ము:మ11.48-12.39<br>రా.కా: మ12.00-1.30 | **3**<br>శ్రావణమాసారంభం<br>శు.పాడ్యమి రా1.46<br>ఆశ్లేష రా2.07<br>వ.మ2.48-4.25 | **10**<br>శు.సప్తమి ఉ10.38<br>స్వాతి మ2.52<br>వ.రా9.08-10.56 | **17**<br>శు.చతుర్దశి సా4.27<br>శ్రవణం రా12.17<br>వ.శేషంఉ6.13వరకు<br>వ.తె4.08-5.40 | **24**<br>బ.సప్తమి రా10.17<br>భరణి మ1.34<br>వ.రా12.50-2.20 | **31**<br>బ.చతుర్దశి మ2.03<br>ఆశ్లేష ఉ9.49<br>వ.రా10.21-12.01 |
| THU గురు<br>దుర్ము:ఉ10.06-10.57<br>మ3.11-4.02<br>రా.కా:మ1.30-3.00 | **4**<br>శు.విదియ రా1.55<br>మఖ రా2.58<br>వ.మ2.33-4.12 | **11**<br>శు.అష్టమి మ12.59<br>విశాఖ సా5.44<br>వ.రా10.10-11.56 | ○ **18**<br>శ్రావణపూర్ణిమమ2.56<br>ధనిష్ఠ రా11.22<br>వర్జ్యం లేదు | **25**<br>బ.అష్టమి రా8.07<br>కృత్తిక మ12.06<br>వ.రా3.17-4.48 | |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.25-9.15<br>మ12.38-1.29<br>రా.కా:ఉ10.30-12.00 | **5**<br>శు.తదియ రా2.41<br>పూర్వఫల్గుణి తె4.26<br>వ.మ11.28-1.10 | **12**<br>శు.నవమి మ3.01<br>అనూరాధ రా8.17<br>వ.రా2.22-4.06 | **19**<br>బ.పాడ్యమి మ1.00<br>శతభిషం రా10.04<br>వ.ఉ6.11-7.41<br>వ.తె4.03-5.32 | **26**<br>బ.నవమి సా6.13<br>రోహిణి ఉ10.52<br>వ.సా4.15-5.47 | |
| SAT శని<br>దుర్ము:ఉ5.53-7.34<br>రా.కా:ఉ9.00-10.30 | **6**<br>శు.చవితి తె4.04<br>ఉత్తర పూర్తిగా<br>వ.మ12.15-2.00 | **13**<br>శు.దశమి సా4.35<br>జ్యేష్ఠ రా10.20<br>వర్జ్యం లేదు | **20**<br>బ.విదియ ఉ10.45<br>పూర్వాభాద్ర రా8.30<br>వ.తె5.24లగాయితు | **27**<br>బ.దశమి సా4.37<br>మృగశిర ఉ9.55<br>వ.సా6.06-7.40 | |

### పండుగలు

1 మాసశివరాత్రి
4 శ్రావణచంద్రోదయం
5 జిల్లాజ్‌నెల ప్రారంభం
6 నాగచతుర్థి (మ.వ్యాప్తి)
8 సామవేదఉపాకర్మ
12 వరలక్ష్మీవ్రతం
14 పుత్రదాఏకాదశి
15 స్వాతంత్ర్యదినోత్సవం
16 కృష్ణయజుర్వేదఉపాకర్మ సింహసంక్రమణం
17 ఋగ్వేదఉపాకర్మ
18 రక్షాబంధనం, హయగ్రీవజయంతి, శుక్లయజుర్వేదఉపాకర్మ
20 శ్రీరాఘవేంద్రఆరాధన
21 సంకష్టహరచతుర్థి
24 శ్రీకృష్ణజన్మాష్టమి
26 వైష్ణవ శ్రీకృష్ణజయంతి
28 అజఏకాదశి
30 మాసశివరాత్రి



### ఆగస్టు శుభసమయములు

శ్రీ దుర్ముఖి శ్రావణమాసము

| | |
|---|---|
| 04 | గురు శు.విదియ మఘ ఉ8.55-10.05 |
| 04 | గురు శు.విదియ మఘ ఉ10.58-మ1.09 |
| 04 | గురు శు.విదియ మఘ రా9.04-10.37 |
| 06 | శని శు.చవితి ఉత్తర ఉ8.47- మ12.14 |
| 06 | శని శు.చవితి ఉత్తర సా5.25-7.16 |
| 07 | ఆది శు.పంచమి హస్త ఉ8.43- మ12.38 |
| 07 | ఆది శు.పంచమి హస్త సా5.43-7.12 |
| 07 | ఆది శు.పంచమి హస్త రా8.52-10.25 |
| 08 | సోమ శు.షష్ఠి చిత్ర ఉ9.02- మ11.37 |
| 10 | బుధ శు.సప్తమి స్వాతి ఉ8.31-10.35 |
| 12 | శుక్ర శు.నవమి అనూరాధ ఉ9.17-మ12.36 |
| 12 | శుక్ర శు.దశమి అనూరాధ సా5.01- 6.52 |
| 14 | ఆది శు.ఏకాదశి మూల ఉ8.32- మ12.29 |
| 14 | ఆది శు.ద్వాదశి మూల సా5.39-6.44 |
| 17 | బుధ శు.చతుర్దశి శ్రవణం ఉ8.04-మ11.45 |
| 17 | బుధ పూర్ణిమ శ్రవణం సా4.42-6.33 |
| 17 | బుధ పూర్ణిమ శ్రవణం రా8.13-9.46 |
| 18 | గురు పూర్ణిమ ధనిష్ఠ ఉ8.00-10.04 |
| 18 | గురు పూర్ణిమ ధనిష్ఠ ఉ10.57- 12.14 |
| 18 | గురు బ.పాడ్యమి ధనిష్ఠ సా4.38- 6.29 |
| 18 | గురు బ.పాడ్యమి ధనిష్ఠ రా8.09-9.42 |
| 19 | శుక్ర బ.పాడ్యమి శతభిషం ఉ9.16- మ12.10 |
| 19 | శుక్ర బ.విదియ శతభిషం సా4.34- 6.25 |
| 19 | శుక్ర బ.విదియ శతభిషం రా8.05- 9.38 |
| 21 | ఆది బ.చవితి ఉత్తరాభాద్ర ఉ8.18-మ12.02 |
| 21 | ఆది బ.చవితి రేవతి రా7.57-9.30 |
| 22 | సోమ బ.పంచమి రేవతి ఉ7.44- మ11.58 |
| 22 | సోమ బ.పంచమి అశ్వని సా4.59-6.13 |
| 22 | సోమ బ.పంచమి అశ్వని రా7.53-9.26 |
| 25 | గురు బ.నవమి రోహిణి రా8.08-9.14 |
| 26 | శుక్ర బ.నవమి రోహిణి ఉ7.28-8.24 |
| 26 | శుక్ర బ.నవమి రోహిణి ఉ9.16- 10.52 |
| 26 | శుక్ర బ.దశమి మృగశిర రా7.37- 9.10 |
| 27 | శని బ.దశమి మృగశిర ఉ7.37- 9.55 |
| 28 | ఆది బ.ఏకాదశి పునర్వసు ఉ9.19- 11.34 |

*Engagements*

## కృష్ణా పుష్కరాలు 2016 ఆగస్టు 12 నుంచి 23

శ్రీ దుర్ముఖి శ్రావణ శుక్లనవమి గురువారం తేది 11 ఆగస్టు 2016 రా9గం॥28ని॥లకు పుష్కరరాజైన గురుగ్రహం ఉత్తర నక్షత్ర 2వపాదం కన్యారాశి ప్రవేశంతో ఆగస్టు 12 నుంచి సార్ధత్రికోటి తీర్ధసహిత కృష్ణా నదికి పుష్కరాలు ప్రారంభమై ఆగస్టు 23 మంగళవారంతో ముగియును. ఇతర తేదీలలో పుష్కరాలు ఆచరించటము పుణ్యప్రదం కాదు.

కృష్ణానది మహారాష్ట్రలోని మహాబళేశ్వరం వద్ద సహ్యాద్రి పర్వత ప్రాంతాలలో పుట్టి మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల గుండా ప్రవహిస్తూ చివరలో బంగాళాఖాతంలో కలియును. దేవతల కోరికపై అశ్వత్థవృక్ష రూపం ధరించిన గోలోక కృష్ణుడు తన శరీరంలోని వామభాగం నుంచి కృష్ణానదిని ఉద్భవించాడని పురాణకథనం. ఈ నదినే కృష్ణవేణి అని కూడా అంటారు.

బ్రహ్మదేవుడు ఈ ప్రాంతంలో తపస్సు చేసిన కారణంగా సహ్యాద్రిని బ్రహ్మగిరి అనియు, మూర్తిరూపంలో వేదాలు శంభోశంకరుని ప్రార్ధించిన ప్రాంతం గనుక వేదగిరి అని పిలువబడును. ఇట్టి వేదగిరి సమీపంలోనే శ్రీకృష్ణభగవానుడు అశ్వత్థ రూపం ధరించాడని ప్రతీక. మునీశ్వరుల ప్రార్ధనమేరకు శివుడు లింగాకారంలో వెలిసినట్లుగాను అక్కడ ఉండే ఉసిరిక వృక్షం నుండి 'వేణీ' అనే నది ఆవిర్భవించి కృష్ణానదిలో కలిసిందని పురాణకథనం. ఈ రెండు కలిసినందునే కృష్ణవేణి నదిగా పిలువబడుతున్నది. కేవలం కృష్ణవేణి నది పవిత్రమైన నామాన్ని ఎవరైతే ఉచ్ఛరిస్తారో అలాంటి వారికి గత ఏడు జన్మల నుంచి వచ్చిన పాపాలన్నీ తొలగి స్వర్గలోక ప్రాప్తి కల్గుతుందని పురాణ కథనం. ఆస్తికులందరూ 2016 ఆగస్టు 12 నుంచి 23 వరకు 12 రోజులపాటు పుష్కరస్నానాలతో తర్పణ పిండప్రదానాదులను ఆచరించాలని శాస్త్రవచనం. కృష్ణానదిని కలుషితం చేయకుండా తర్పణాలను వదిలేది.

గత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రస్తుతం రెండు తెలుగురాష్ట్రాలుగా విభజించబడింది. ఈ రెండు తెలుగురాష్ట్రాల మధ్యభాగంలోనే విజయవాడ నగరం ఉన్నది. ప్రస్తుతం ఈ తెలుగు రాష్ట్రానికి అమరావతి అనే పేరు పెట్టటం జరిగింది. గుంటూరుకు 35 కిలోమీటర్ల దూరంలో ఉన్న పంచారామములలో ఉన్న క్షేత్రమే ఇది. ఇక్కడ అమరేశ్వరస్వామి ఆలయం ప్రఖ్యాతమైనది. అలాగే విజయవాడలోని ఇంద్రకీలాద్రి మీద వేంచేసిన శ్రీ కనకదుర్గ మల్లిఖార్జున స్వామి, విజయవాడకు 12 కిలోమీటర్ల దూరంలో మంగళగిరి పానకాల స్వామి, అలాగే కృష్ణానదీ తీరంలో ఉన్న శ్రీశైల మల్లిఖార్జునుడు, బిచ్‌పల్లి ఆంజనేయస్వామి, వేదాద్రి లక్ష్మీనరసింహస్వామి, శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణువు రాజ్యలక్ష్మీ అమ్మవార్లు దర్శనీయక్షేత్రములు.

## కృష్ణా పుష్కరాలు సుముహూర్తాలకు ఆటంకమా ?

**తీరవాసీ విషయే క్వచిద్విశేషోభిహితాః ॥ తద్యథా ॥**

**శ్లో॥ వివాహోపనయే చైవ గర్భాదాన నిషేకయోః ।**
**ద్వయోః పుష్కరయోః మధ్యే తత్తీరే నశుభో భవేత్ ॥**

**శ్లో॥ ద్వయోః పుష్కరయోః అంతే వివాహాది శ్శుభో భవేత్ ।**
**మధ్యే మృత్యు ప్రదశ్చాపి ధన ధాన్యాది నాశకృత్ ॥**
**గురౌ కన్యాగతేతు కృష్ణాయాం నతు తత్తీర వాసినాం ॥**

**శ్లో॥ గోదావరి కృష్ణవేణ్యుత్తరే యోజన త్రయం ।**
**తీరమిత్యాహురాచార్యా దక్షిణే యోజన ద్వయం ॥**

మహాభారతంలోని శాంతిపర్వంలో ఉన్న శ్లోక ఆధారంగా గోదావరీ, కృష్ణా నదీ తీర ప్రాంతములలో వివాహాది సుముహూర్తములు పై శ్లోకాధారంగా చేయకూడదని తెలియుచున్నది. ఒక యోజమనగా 9 మైళ్లు, ఒక మైలు అంటే 1.6 కిలోమీటర్లని అర్ధము. గోదావరీ కృష్ణా నదులకు ఉత్తరం 3 యోజనములు, దక్షిణం 2 యోజనములు వివాహ నిషిద్ధమని భావము. అనగా ఉత్తరం వైపు 43 కిలోమీటర్ల వరకు, దక్షిణం 29 కిలోమీటర్ల వరకు నిషిద్ధమని అర్ధము. గోదావరీ అంత్య పుష్కరాలు 31 జూలై 2016 నుంచి 11 ఆగస్టు 2016 వరకు, కృష్ణా పుష్కరాలు 12 ఆగస్టు 2016 నుంచి 23 ఆగస్టు 2016 వరకు ఉండును. కనుక ఈ సమయంలో వివాహాలు పై కిలోమీటర్ల పరిధిలో చేయకూడదని పై శ్లోక అర్ధము. మరి చేయకూడదా ?

పితృదేవతల ఆశీస్సులకై తర్పణ, పిండప్రదానాదులు ఆచరించే నిమిత్తంగా పై 24 రోజులలో వివాహాది శుభ కార్యములు చేయకూడదు. మిగిలిన సమయంలో చేయవచ్చును. ఈ 24 రోజులలో పైన చెప్పిన కిలోమీటర్ల పరిధి దాటిన వారు నిరభ్యంతరంగా చేసుకొనవచ్చును. శాస్త్రవచనాలు ఉన్నప్పటికీ, వాటిని అధిగమించి పుష్కరాలు జరుగుతున్ననూ, వ్యవహారికంగా తీర ప్రాంతాలలో వివాహ శుభకార్యాలు జరుగుతూనే ఉన్నాయి. కనుక సాంప్రదాయాన్ని పాటించాలనుకున్న వారు పై 24 రోజులను విసర్జించండి. వ్యవహారికతను పాటించాలనుకున్న వారు ఆచరించుకోవటానికి ప్రయత్నించండి. ప్రస్తుత రోజులలో వివిధ గ్రంధాలను ఆధారంగా చేసుకొని పండితులు ప్రస్తావిస్తున్నప్పటికీ, సాంప్రదాయం కంటే వ్యవహారికతకు పలువురు మొగ్గు చూపుతున్నారు.

మా కాలచక్రం, గ్రహభూమి పంచాంగాలలో ముహూర్తాలను ఇవ్వటం జరిగింది. కేవలం మా రెండు పంచాంగాలు ఈ 45 కిలోమీటర్ల పరిధిలో ఉన్నవారికి మాత్రమే వినియోగించాలని కాదు. రెండు తెలుగు రాష్ట్రాలలోను, తమిళనాడు, కేరళ, కర్ణాటక తెలుగు ప్రజలకు మాత్రమే కాక భారతదేశ వ్యాప్తంగా ఉన్న తెలుగు వారందరూ మా పంచాంగాలను వినియోగిస్తున్నారు.

కనుక వివాహాది సుముహూర్తములు ఆ తీర ప్రాంతాలలో నివాసమున్నప్పటికీ, ఇతర ప్రాంతాలకు వెళ్లి వివాహాది శుభకార్యాలను ఆచరిస్తున్నారు. ఒకవిధంగా చెప్పాలంటే పుష్కరాల సమయంలో ఎందుకు సుముహూర్తాలు చేయకూడదో ప్రజలు ముందుగా అర్ధం చేసుకోవాలి. దైవీ దేవతల కంటే పితృదేవతలే ప్రధానము. అందుకే వివాహ శుభకార్యాలలో ముందుగా నాందీ శోభనా దేవతాహ్వానంగా పితృదేవతలను పూజించటం జరుగుతుంది.

ఈ పితృదేవతల కొరకై, తర్పణ పిండప్రదానాదులను వైదికమార్గంలో ఆచరించుటకై వేలాదిమంది వైదికులు అవసరం. కనుక వారి అవసరాన్ని ప్రజలు గమనించి, శుభ కార్యాల కంటే పితృకార్యాలకే ప్రాధాన్యత ఉంది కనుక, ప్రతివారు ఈ కార్యాలను ఆచరించాలంటే పండితులు అవసరం కనుక... ఈ సమయంలో శుభకార్యం నిర్వహించటానికి పండితులు కూడా దొరకని పరిస్థితి కూడా ఏర్పడుతుంది.

విశ్వాసంతో చేసే కార్యానికి ప్రతివారి అవసరం ఎంతెంతో ఉంటుంది. కనుక దీనిని దృష్టిలో ఉంచుకునే పుష్కర సమయాలలో పితృకార్యాలకే ప్రాధాన్యత ఇస్తారు. కానీ ప్రస్తుత రోజులలో తల్లి తండ్రుల అవసరాలు, అలాగే ఇతర దేశాలలో నివాసముండే యువతీ, యువకుల అవసరాలు... మొదలైన వాటిని గమనించి... మధ్యమార్గంగా.. శాస్త్ర అంశాలను పరిగణలోనికి తీసుకుంటున్నారు. ఈ పరంపరలో తీర ప్రాంతాలలో నివాసముండేవారు ఇతర ప్రాంతాలకు వెళ్లి వివాహాది శుభకార్యములు ఆచరించటం ఎన్నో సంవత్సరాలుగా జరుగుచున్నది. ఈ 24 రోజులు వేచి ఉండి తదుపరి వివాహం చేసినచో కొంత ఆలస్యమగుననే భావంతో కూడా... పండితులు ప్రస్తావిస్తున్నప్పటికీ మధ్యేమార్గానికే ప్రాధాన్యత ఇవ్వటం జరుగుచున్నది.

గోదావరీ నది అంత్యపుష్కరాలలోను, కృష్ణా నది పుష్కర సమయాలలోను ఇవ్వవలసిన దానములకు ఒక నిర్ధుష్టమంటూ ఏమీ ఉండదని గమనించాలి. ఎవరి శక్త్యానుసారము వారు దానం చేస్తారు. అంతేతప్ప ఫలానా రోజు బంగారాన్నే దానం చేయాలి అనే నియమం ఏమీ లేదు. సంపన్నవర్గీయులు పుష్కరాలలో నిత్యం సువర్ణ దానంచేసే శక్తి ఉంటుంది. కానీ నిత్యం కుటుంబ పోషణే జరగని వారిని సువర్ణదానం చేయాలని చెప్పటం కేవలం హాస్యాస్పదం. కాబట్టి వ్యవహారికతే అధిక ప్రాధ్యాతను సంతరించుకుంటున్నది.

## వృశ్చికరాశి

శ్రీ మన్మథ : ఆదాయం:14, వ్యయం:14, రాజ్యపూజ్యం:3, అవమానం: 1

శ్రీ దుర్ముఖి : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:1, అవమానం:2

**జనవరి 2016 :** జీవనోపాధి విషయంలో స్థిరత్వం. సంతానంపై విమర్శలు. ఆవేశమధికము. అవివాహితులకు అనవసర ప్రయాణాలు. మాసాంతంలో కుటుంబ ప్రశాంతత. అంతర్గత వ్యవహారాలు గుట్టురట్టు. స్వయంవృత్తుల వారికి విజయ ప్రాప్తి. నిరుద్యోగులకు తీపివార్తలు. జనవరి 21 ఉ8.36 నుంచి 23 మధ్యాహ్నం 2.06 వరకు వ్యతిరేక రోజులు.

**ఫిబ్రవరి 2016 :**స్నేహితబాధ్యతను స్వీకరించలేరు. కపటస్వభావుల ఆంతర్యం తెలియును. మాసమంతా ఖర్చు పెరుగును. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పు చేర్పులుండును. స్పెక్యులేషన్ లబ్ది కాదు. మాసాంతంలో కార్యసిద్ధి. మానసిక వత్తిడి అధికము. అవివాహితులకు శుభవార్త. ఆర్ధికస్థితి సాధారణం. ఫిబ్రవరి 17 మధ్యాహ్నం 2.22 నుంచి 19 రాత్రి 8.50 అనుకూలం కాదు.

**మార్చి 2016 :** జాయింట్‌దారులకు నిర్వహణలో లోపాలు కనపడును. అంచనాలు వాస్తవరూపం దాల్చును. చలాకీతనం పెరుగును. శతృబెడద తగ్గును. సంతానంచే విజయప్రాప్తి. స్పెక్యులేషన్ ఆశాజనకం కాదు. రెండవపక్షంలో సమస్యల వలయాన్ని చేధిస్తారు. లౌకిక విషయాలపై ఆసక్తి ఎక్కువ. మార్చి 15 రాత్రి 8.03 నుంచి 17 రాత్రి 2.23 వరకు ప్రతికూల సమయము.

**ఏప్రిల్ :** శుభకార్యసిద్ధి. బుద్ధిబలంతో నిర్ణయాలు తీసుకుంటారు. హామీ ప్రయత్నాలు నెరవేరును. సంతానంపై విమర్శలుండును. అవివాహితులు నిర్ణయాలు తీసుకోలేరు. వివాద విషయాలలో జోక్యం చేసుకుంటారు.ఏప్రిల్ 11 అర్ధరాత్రి తదుపరి 3.33 నుంచి 14 ఉదయం 8.32 వరకు సమయం అనుకూలం కాదని గమనించి, ముఖ్య విషయాలలో జాగ్రత్త వహించాలి.

**మే :** సమయస్ఫూర్తిని పాటించలేరు. ఆధిపత్య సంభాషణలతో కార్యసిద్ధి కాదు. నరాల,భుజాల తీపు అధికం. ఋణభారం పెరుగును. బంధువుల నుంచి వత్తిడి అధికం. ఆర్భాట వ్యవహారాలను మానుకోలేరు. వాదనా పటిమ తగ్గును. జాయింటు వ్యాపారాలకు ఆదాయంలో గండి. శరీరం తరచూ అలసత్వంగా ఉండును. మే 9 మధ్యాహ్నం 1.08 నుంచి 11 సాయంత్రం 4.30 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి.

**జూన్ :** ఖచ్చిత నిర్ణయాలు తీసుకుందురు. మధ్యమధ్యలో ఆర్ధిక మాంద్యం. రాజీధోరణకి కట్టుబడరు. భూ,గృహ మార్పులు ఉన్నవి. మరమ్మత్తులకు ధనవ్యయం. మిత్రభేదం లేదు. రహస్య నిర్ణయాలు దాచలేరు. మనోసంకటం మాసాంతంలో అధికం. ఆందోళన, విసుగు వచ్చిననూ ధైర్యంగా ఉంటారు. జూన్ 5 రాత్రి 11.31 నుంచి 7 అర్ధరాత్రి 2.00 వరకు ప్రతికూలసమయమని భావించాలి.

**జూలై :** ప్రత్యేక ప్రతిపత్తిని ఆశిస్తారు. ఋణవిముక్తికి మార్గం సుగమం. నూతన అగ్రిమెంట్లు ఫలించును. మాసం మధ్యలో ఆరోగ్యభంగములు. స్వార్ధబుద్ధి తగ్గును. వివాదాంశాలచే మనఃక్లేశము. వ్యక్తిగత ఆకర్షణలతో పరోక్ష లబ్ది. అకాలభోజనాదులు కలవు. జూలై 3 ఉదయం 9.01 నుంచి 5 మధ్యాహ్నం 11.44 వరకు తిరిగి 30 సాయంత్రం 4.35 నుంచి ఆగస్టు 1 రాత్రి 8.19 వరకు వ్యతిరేక సమయం.

**ఆగస్టు :** కళత్రంచే ఖర్చులధికము. పుణ్యకార్యాచరణకై మక్కువ పెరుగును. శతృవర్గ వైషమ్యాల సమాచారం సేకరిస్తారు. అనవసర స్పెక్యులే షన్‌చే ధనవ్యయం. శుభచర్చలు వాయిదా పడును. శక్తియుక్తులతో ఇతరులను మెప్పించలేరు. ఆగస్టు 26 రాత్రి 10.23 నుంచి 28 అర్ధరాత్రి 3.06 వరకు ఆవేశాలకు లోనుకాకుండా నిర్ణయాలు దాటవేసే ధోరణిలో ఉండాలి.

**సెప్టెంబరు :** అధికారులచే సమస్యలున్నవి. ఆత్మవిశ్వాసం తగ్గును. ఉద్యోగులపై నిఘా పెరుగును. రాబడి విషయాలలో నిర్ణయాలు మారును. సంతానంపై వ్యాకులత్వమేర్పడును. కుటుంబ నిర్ణయాలను శిరసావహిస్తారు. సునాయాస ప్రయత్నాలు కఠినము. సెప్టెంబరు 23 అర్ధరాత్రి 3.02 నుంచి 25 ఉదయం 8.38 వరకు ముఖ్య అంశాలలో తొందరపాటు వద్దు.

**అక్టోబరు :** స్వయంవృత్తుల వారికి అనుకూలము. మనోవాంఛలు నెమ్మదిగా సిద్ధించును. భాగస్వామ్య నిర్ణయాలు నెరవేరును. రహస్యచర్చలు ఫలించవు. ప్రణాళికాబద్ధంగా మసులుకుంటారు. కార్యసిద్ధి, ఆధిపత్యపోరుకి ఖర్చధికము. కాంట్రాక్టులు, స్పెక్యులేషన్లచే స్వల్ప నష్టం. అక్టోబరు 20 మధ్యాహ్నం 11.11 నుంచి 22 మధ్యాహ్నం 2.35 వరకు నిదానమే ప్రధానంగా భావించాలి.

**నవంబరు :** నిర్మాణాత్మక శక్తులను పెంచుకుంటారు. ఋణదాతల వత్తిడి ఉండదు. సంతానానికి విజయప్రాప్తి. స్పెక్యులేషన్‌లో నష్టముండదు. కుటుంబ అన్యోన్యత పెరుగును. మాసాంతంలో మనఃక్లేశములు. శుభకర చర్చలు వ్యక్తిగతంగా చేయలేరు. కృషికి తగిన ఫలితముండును. వాహన మరమ్మత్తులకై ధనవ్యయం. నవంబరు 16 రాత్రి 8.59 నుంచి 18 రాత్రి 10.36 వరకు అనుకూల సమయం కాదు.

**డిశంబరు :** చంచలత్వాన్ని విడనాడుదురు. పాలనానిర్ణయాలు ఆలస్యంగా సాగును. శుభకార్యాచరణకు విజయం చేకూరును. ధైర్యంతో అడుగులు వేయగలరు. శస్త్ర చికిత్సరాగల సూచన కలదు. సజ్జన సహచర్యం లబ్ధిని అందించును. స్నేహసంబంధాలు మెరుగుపడును. అంకితభావానికి పెద్దపీట వేయుదురు. డిశంబరు 14 ఉదయం 8.16 నుంచి 16 ఉదయం 8.54 వరకు ప్రతికూల సమయం.

PRANATHI TV నిత్యప్రవచకులు...

# కాలచక్రం

## జ్యోతిష రెమిడీస్ కేలండర్

కాలచక్రం పంచాంగకర్త
శ్రీకాలజ్ఞాన విభూషణ బిరుదాంకిత
పండిత శ్రీ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ దైవజ్ఞ



దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాసగార్గేయ, చి॥ నందినీగార్గేయ గార్లచే రచించబడినది. హైద్రాబాద్ ఫోన్ : 9346032385, 9347032385, 9348032385

శ్రీ దుర్ముఖ నామ సంవత్సర
శ్రావణ బహుళ అమావాస్య గురువారం
నుంచి భాద్రపద అమావాస్య
శుక్రవారం వరకు

# 2016 SEPTEMBER సెప్టెంబరు

సెప్టెంబరు 1 శ్రావణఅమావాస్యన సింహరాశిలో సంపూర్ణ సూర్యగ్రహణం ఉన్నది. ఇది భారతదేశంలో కనపడదు.

## పండుగలు

1 పోలాలఅమావాస్య
2 భాద్రపదచంద్రోదయం
3 జిల్లేజ్ నెలారంభం
4 హరితాళికావ్రతం, షోడశోమావ్రతం
5 వినాయకచతుర్థి
6 ఋషిపంచమి
7 సూర్యషష్ఠి
8 అముక్తాభరణవ్రతం
9 రాధాష్టమి
10 నందనవమి
12 క్షీరవ్రతారంభం గురుమౌఢ్యారంభం
13 పరివర్తన్యేకాదశి వామనజయంతి,ఓనం
15 అనంతపద్మనాభవ్రతం
16 ఉమామహేశ్వరవ్రతం కన్యాసంక్రమణం
17 మహాలయపక్షారంభం
18 ఉండ్రాళ్లతద్దె
19 సంకష్టహరచతుర్థి
20 భరణీమహాలయం
23 రుద్రాష్టమి (ప్రదోషం) మధ్యాష్టమి (అపరాహ్ణ)
24 అవిధవనవమి
26 ఇంద్రైకాదశి
27 యతీమహాలయం

| | | | | | |
|---|---|---|---|---|---|
| SUN ఆది<br>దుర్ము: సా4.36-5.25<br>రా.కా: సా4.30-6.00 | | 4<br>శు.తదియ సా6.54<br>హస్త సా4.54<br>వ.రా1.49-3.36 | 11<br>శు.నవమి ఉ7.29<br>మూల ఉ8.45<br>వ.ఉ7.01-8.45<br>వ.సా6.49-8.30 | 18<br>బ.విదియ సా6.21<br>రేవతి రా12.55<br>వ.మ2.09-3.35 | 25<br>బ.దశమి రా1.02<br>పునర్వసు మ2.37<br>వ.రా10.46-12.24 |
| MON సోమ<br>దుర్ము:మ12.30-1.19<br>మ2.57-3.46<br>రా.కా:ఉ7.30-9.00 | | 5<br>శు.చవితి రా9.09<br>చిత్ర రా7.40<br>వ.రా1.58-3.46 | 12<br>శు.దశమి ఉ8.05<br>పూర్వాషాఢ ఉ9.56<br>వ.సా6.06-7.43 | 19<br>బ.తదియ మ3.06<br>అశ్విని రా10.29<br>వ.సా6.53-8.19 | 26<br>బ.ఏకాదశి రా1.03<br>పుష్యమి మ3.04<br>వ.తె4.22-6.02 |
| TUE మంగళ<br>దుర్ము: ఉ8.25-9.14<br>రా10.55-11.42<br>రా.కా: మ3.00-4.30 | | 6<br>శు.పంచమి రా11.35<br>స్వాతి రా10.38<br>వ.తె4.56లగాయితు | 13<br>శు.ఏకాదశి ఉ7.56<br>ఉత్తరాషాఢ ఉ10.24<br>వ.మ2.21-3.56 | 20<br>బ.చవితి మ11.57<br>భరణి రా8.11<br>వ.ఉ7.10-8.36 | 27<br>బ.ద్వాదశి రా1.33<br>ఆశ్లేష సా4.00<br>వ.తె4.43 లగాయితు |
| WED బుధ<br>దుర్ము:మ11.40-12.29<br>రా.కా: మ12.00-1.30 | | 7<br>శు.షష్ఠి రా2.03<br>విశాఖ రా1.38<br>వ.శేషంఉ6.44వరకు | 14<br>శు.ద్వాదశి ఉ7.02<br>శు.త్రయోదశి తె5.27<br>శ్రవణం ఉ10.08<br>వ.మ1.58-3.30 | 21<br>బ.పంచమి ఉ9.02<br>కృత్తిక సా6.10<br>వ.ఉ7.10-8.38 | 28<br>బ.త్రయోదశి రా2.32<br>మఘ సా5.25<br>వ.శేషంఉ6.24వరకు<br>వ.రా2.02-3.45 |
| THU గురు<br>దుర్ము:ఉ10.04-10.53<br>మ2.59-3.49<br>రా.కా:మ1.30-3.00 | • 1<br>శ్రావణఅమావాస్యమ2.33<br>మఘ ఉ10.53<br>వ.రా7.24-9.06 | 8<br>శు.సప్తమి తె4.18<br>అనూరాధ తె4.26<br>వ.ఉ6.06-7.53 | 15<br>శు.చతుర్దశి రా3.15<br>ధనిష్ఠ ఉ9.10<br>వ.మ3.55-5.25 | 22<br>బ.షష్ఠి ఉ6.27 బ.సప్తమి తె4.18 రోహిణి సా4.32<br>వ.ఉ9.04-10.34<br>వ.రా9.51-11.23 | 29<br>బ.చతుర్దశి రా3.55<br>పూర్వఫల్గుణిరా7.15<br>వ.రా3.07-4.51 |
| FRI శుక్ర<br>దుర్ము:ఉ8.25-9.14<br>మ12.31-1.20<br>రా.కా:ఉ10.30-12.00 | 2<br>భాద్రపదమాసారంభం<br>శు.పాడ్యమి మ3.32<br>పూర్వఫల్గుణిమ12.26<br>వ.రా8.14-9.59 | 9<br>శు.అష్టమి పూర్తిగా<br>జ్యేష్ఠ పూర్తిగా<br>వ.ఉ10.36-12.22 | ○ 16<br>పూర్ణిమ రా12.34<br>శతభిషం ఉ7.39<br>పూర్వాభాద్ర తె5.39<br>వ.మ1.31-2.59 | 23<br>బ.అష్టమి రా2.40<br>మృగశిర మ3.22<br>వ.రా11.32-1.06 | 30<br>భాద్రపదఅమావాస్యతె5.41<br>ఉత్తర రా9.27<br>వర్జ్యం లేదు |
| SAT శని<br>దుర్ము:ఉ5.57-7.36<br>రా.కా:ఉ9.00-10.30 | 3<br>శు.విదియ సా5.00<br>ఉత్తర మ2.27<br>వ.రా11.43-1.28 | 10<br>శు.అష్టమి ఉ6.11<br>జ్యేష్ఠ ఉ6.52<br>వ.మ3.30-5.13 | 17<br>బ.పాడ్యమి రా9.34<br>ఉత్తరాభాద్ర రా3.22<br>వ.మ2.20-3.47 | 24<br>బ.నవమి రా1.35<br>ఆర్ద్ర మ2.43<br>వ.రా2.40-4.16 | 28 గజచ్ఛాయ<br>29విషశస్త్రహతమహాలయం, మాసశివరాత్రి<br>30మహాలయఅమావాస్య, బతుకమ్మపండుగ, కుశగ్రహణం (దర్భస్వీకారం) |

దృగ్గణిత పంచాంగాలు ఖచ్చిత ఋజువునకు సరిపోవుచున్నవి. - మోహన్ పబ్లికేషన్స్

## సెప్టెంబరు శుభసమయములు

శ్రీ దుర్ముఖి భాద్రపదమాసము

| | |
|---|---|
| 03 | శని శు.విదియ ఉత్తర ఉ7.37-మ11.11 |
| 03 | శని శు.విదియ హస్త రా7.06-8.39 |
| 04 | ఆది శు.తదియ హస్త ఉ6.53-11.07 |
| 04 | ఆది శు.చవితి చిత్ర రా7.02-8.35 |
| 05 | సోమ శు.చవితి చిత్ర ఉ6.49- మ11.03 |
| 08 | గురు శు.సప్తమి అనూరాధ ఉ7.54-10.51 |
| 08 | గురు శు.సప్తమి అనూరాధ సా6.46-8.19 |
| 10 | శని శు.అష్టమి మూల సా6.38-8.11 |
| 12 | సోమ శు.ఏకాదశి ఉత్తరాషాఢ ఉ9.57-10.35 |
| 12 | సోమ శు.ఏకాదశి ఉత్తరాషాఢ రా7.44-8.03 |
| 14 | బుధ శు.త్రయోదశి శ్రవణం ఉ7.03- 10.08 |
| 14 | బుధ శు.త్రయోదశి ధనిష్ఠ సా6.22-7.55 |
| 15 | గురు శు.చతుర్దశి ధనిష్ఠ ఉ6.09-9.10 |
| 15 | గురు శు.చతుర్దశి శతభిషం ఉ9.11- 10.00 |
| 15 | గురు శు.చతుర్దశి శతభిషం సా6.18- 7.51 |
| 16 | శుక్ర పూర్ణిమ శతభిషం ఉ6.05-7.39 |
| 17 | శని బ.పాడ్యమి ఉత్తరాభాద్ర ఉ7.37- 10.16 |
| 17 | శని బ.పాడ్యమి ఉత్తరాభాద్ర సా6.11- 7.44 |
| 17 | శని బ.విదియ ఉత్తరాభాద్ర రా9.35 - 11.31 |
| 18 | ఆది బ.విదియ రేవతి ఉ8.03 -10.12 |
| 18 | ఆది బ.తదియ రేవతి సా6.22-7.40 |
| 18 | ఆది బ.తదియ రేవతి రా9.27-11.27 |
| 19 | సోమ బ.తదియ అశ్వని ఉ7.59- 10.08 |
| 22 | గురు బ.సప్తమి మృగశిర సా5.51- 9.10 |
| 23 | శుక్ర బ.అష్టమి మృగశిర ఉ7.43- 8.22 |
| 24 | శని బ.నవమి పునర్వసు సా5.43-9.02 |
| 25 | ఆది బ.దశమి పునర్వసు ఉ7.35- 9.44 |
| 25 | ఆది బ.దశమి పుష్యమి సా5.39- 8.58 |
| 26 | సోమ బ.ఏకాదశి పుష్యమి ఉ7.31- 9.40 |

*Engagements*

## వివాహ పొంతనలలో పాయింట్ల పట్టిక అశాస్త్రీయం

వధూవరుల జన్మనక్షత్రాలచే వధూవర గుణమేళన పట్టిక ద్వారా వివాహ నిర్ణయాలను చేస్తుంటారు. 18 లేక అంతకంటే అధికంగా, గుణమేళన పట్టికలో పాయింట్లు వస్తే ఇరువురికీ వివాహం అనుకూలమని, 18 కంటే తక్కువ ఉంటే వివాహం చేయకూడదనేది... వధూవర గుణమేళన పట్టిక భావం. అనుభవంలో పరిశీలించగా.... 18 పాయింట్ల కంటే ఎక్కువ వచ్చి వివాహమైన వారిలో అధికులు మనస్పర్ధలు, అభిప్రాయబేధాలు, దాంపత్యభంగములు ఏర్పడి, విడాకులు తీసుకోవటము, ద్వితీయవివాహాలు చేసుకోవటము జరిగింది. 18 కంటే తక్కువ వచ్చి షష్ఠి పూర్తి కార్యములు జరుపుకున్న దంపతులు కూడా ఉన్నారు.

అనుభవంలో వేలాది దంపతుల స్థితిగతులను పరిశీలిస్తే వధూవర గుణమేళన పట్టిక పూర్తి అశాస్త్రీయమని ఋజువైనది. కనుక తల్లిదండ్రులు తమ సంతానానికి వివాహం చేసే సమయంలో వధూవర గుణమేళన పట్టికను చూడవద్దు. యువతీ యువకుల జాతకాలలో సంతాన, కళత్ర, ఆయుస్థాన అధిపతులు మిత్రశతృత్వాలు పరిశీలించి, ఇతర దోషాలు లేకుండా చూసుకుని వివాహ నిర్ణయాలను చేసుకోవాలి. వధూవరులిరువురికీ తారాబలం ఎలా ఉందో గమనించాల్సిన అవసరం ఉంది. సహజంగా తారాబలంలో క్షేమతారను శుభకరంగా గుర్తిస్తాం.

కానీ.... అమ్మాయికి అబ్బాయికి తారాబలాలు చూస్తుంటే... ఒక వైపు నుంచి క్షేమతారాబలం ఉండి.... మరోవైపు నుంచి ప్రమాదకర నైధనతారాబలం ఉంటుంది. మరి ఇట్టి స్థితిలో క్షేమతార ఉందని స్వీకరించాలా? నైధనతారాబలం ఉందని విసర్జించాలా?

ఇలాంటి అనుమానాలు చాలామందికి వస్తుంటాయి. అనుభవంలో పరిశీలిస్తే... క్షేమతార, నైధనతారలతో చేసిన వివాహాలు.... కొంతకాలానికి అనుకోని కారణాలచే సమస్యలు రావటము, అభిప్రాయబేధాలు వచ్చి విడాకులు తీసుకొనటము జరిగింది. కనుక వివాహ పొంతనకు క్షేమతారాబలాన్ని విసర్జించండి. కేవలం ముహూర్తాలకు మాత్రం క్షేమతారను స్వీకరించండి.

నూటికి 75శాతం వరకు క్షేమతార, నైధనతారలతో ఉన్న జంటలు సమస్యల వలయాల లోనే ఉంటూ... జీవితాలు సాగిస్తున్నారు. 25 శాతం జంటలు కొంత ఆశాజనకమైన పరిస్థితితో ఉంటున్నారు. కనుక 27 నక్షత్రాలలో జన్మించిన వారు వివాహ నిర్ణయాలలో ఏయే నక్షత్రాలలో జన్మించిన వారిని వివాహం చేసుకొనాలని తెల్పే పూర్తి పట్టికలను ఈ క్యాలెండర్‌లోని వెనుక పేజీలలో ఇవ్వటం జరిగింది. పొంతనలలో 27 నక్షత్రాలకు క్షేమతారలు, నైధనతారలు, అష్టమచంద్రదోషాన్నిచ్చే తారలను విసర్జించి పూర్తిగా అనుకూల నక్షత్రాల వివరాలను ఇవ్వటం జరిగింది. కనుక పాఠకులు అవసరమైన నక్షత్రాన్ని ఎంచుకున్నప్పటికీ, ఆ నక్షత్రంతో... ఇరువురి జాతకపొంతన సరిచూసుకోవటం మంచిది.

## కీర్తిముఖుడుని స్వాగతించండి

శివుని కనుబొమ్మల నుంచి ఆవిర్భవించి, శివాజ్ఞ లేకుండా స్వీయ నిర్ణయంతోనే... శివసన్నిధికి దూతగా వచ్చిన వ్యక్తిని అధర్మమార్గంలో సంహరించబోయి, కానీ చివరలో శివాజ్ఞను శిరసావహించాడు. అందుకే శరీరమంతా అధర్మవర్తనకు.. పరిహారంగా పోయిననూ... మహాశివభక్తి తత్పరతకు కేవలం మిగిలింది ముఖం మాత్రమే. ఆ ముఖమే **కీర్తిముఖుడుగా** అనంతగౌరవాన్ని పొందుతూ కైలాస ముఖద్వారానికి ఓ మహాదివ్య పురుషునిగా ఉండే అదృష్టాన్ని పొందినవాడు కీర్తిముఖుడు. అంతర్లీనంగా ఓ గొప్ప సందేశం ఉన్న కారణంగానే కీర్తిముఖుని ఆవిర్భావ కధను కార్తికమాస 21వ రోజున పారాయణాంశమైనది.

కైలాసమనే మన గృహంలో కూడా సకల శుభ అనుగ్రహానికై కీర్తిముఖుడు అవసరం. ఈ కీర్తిముఖుడిని సకల శుభాలు అనుగ్రహించమని భక్తి విశ్వాసాలతో పూజించాలి. సకల శుభాలు కలగటమంటే, సకల దోషాలు పోవటమనే భావం. ప్రణవ సహిత గణపతి, ఇచ్ఛా శక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తులు అంతర్లీనంగా కీర్తిముఖుడిలో ఉంటారు. ప్రతివారు నిత్యం కీర్తిముఖుడిని ఆరాధిస్తుంటే...అంతర్లీనంగా ఉన్న దైవశక్తులను ప్రార్ధిస్తున్నట్లేనని భావన.

నిత్యం పూజించే అవకాశం లేకున్నప్పటికీ మనసారా భక్తితో, అచంచల విశ్వాసంతో దేహం లేని శిరస్సుతో ఉన్న కీర్తిముఖుడిని ఎన్ని పర్యాయాలైనా వీక్షించండి. ఈ వీక్షణలే పరోక్షంగా సకల శుభాలను స్వాగతిస్తాయి. కీర్తిముఖుడి చిత్రపటాన్ని సింహద్వారానికి పై భాగాన లేక నేరుగా లోపలికి వస్తే, సింహద్వారమున్న గోడ కాకుండా.. మిగిలిన మూడు గోడలలో ఏ గోడకైననూ, కీర్తిముఖుడి చిత్రపటాన్ని పెట్టుకోవచ్చు.

కీర్తిముఖుడి శిరస్సుపై 'ఓం' బీజాక్షరం, కుడిచెవి ప్రక్కన 'గం' బీజాక్షరం, ఎడమచెవి ప్రక్కన 'ఐం' బీజాక్షరం, నాలుక కుడివైపున 'హ్రీం' బీజాక్షరం, నాలుకకు ఎడమవైపున 'శ్రీం' బీజాక్షరంతో కీర్తిముఖుడు చిత్రపటం ఉంటుంది. అనగా ఓం, గం, ఐం, హ్రీం, శ్రీం... ఐదు బీజాక్షరాల సంపుటంతో కీర్తిముఖుని చిత్రపటముండును. మన కన్నులతో కీర్తిముఖుడిని వీక్షిస్తున్నప్పుడు చిత్రపటంలో ఓం, గం, ఐం, హ్రీం, శ్రీం... ఐదు బీజాక్షరాల తత్త్వ మహిమచే... సకల శుభాలు కల్గునని మహానుభావుల మనోదృష్టికందిన అంశం.

శ్రావణం నుంచి కార్తికం వరకు ప్రతి పూర్ణిమరోజున ఒక్కో బీజాక్షరంతో క్కో దేవతను ఆరాధిస్తూ.. కార్తిక బహుళషష్ఠి నాడు ప్రణవంతో కీర్తిముఖుడిని ఆరాధించాలి. శ్రావణ పూర్ణిమ నాడు శ్రీం బీజాక్షరంతో లక్ష్మీదేవిని అనుగ్రహానికై కీర్తిముఖుడిని స్వాగతించాలి. భాద్రపద పూర్ణిమ నాడు హ్రీం బీజాక్షరంతో పార్వతీదేవిని ఆరాధిస్తూ కీర్తిముఖుడిని అర్చించాలి. ఆశ్వీజపూర్ణిమ నాడు ఐం బీజా క్షరంతో సరస్వతీదేవిని స్తుతిస్తూ కీర్తిముఖుడిని అర్చించాలి. కార్తికపూర్ణిమ నాడు గం బీజాక్షరంతో గణపతిని ప్రార్ధిస్తూ కీర్తిముఖుడిని అర్చించాలి. కార్తిక బహుళషష్ఠి నాడు ప్రణవంతో కీర్తిముఖుడిని ఆరాధించాలి.

శ్రావణపూర్ణిమ, భాద్రపదపూర్ణిమ, ఆశ్వీజపూర్ణిమ, కార్తికపూర్ణిమ మరియు కార్తిక బహుళ షష్ఠి రోజులలో శ్రీం, హ్రీం, ఐం, గం, ఓం బీజాక్షరాల సహితంగా ఆయా దేవతామూర్తులను 16 నామాలతో ఆరాధించాలి. పై రోజులలో ఏయే నామాలతో ఆరాధించాలో ఈ 2016లో ఆ ఐదు రోజులు ఎప్పుడెప్పుడు వస్తున్నాయో తెలుసుకుందాం.

శ్రీ దుర్ముఖి నామ సంవత్సర **శ్రావణ పూర్ణిమ 18 ఆగస్ట్ 2016 గురువారం, భాద్రపద పూర్ణిమ 16 సెప్టెంబర్ 2016 శుక్రవారం, ఆశ్వీజపూర్ణిమ 16 అక్టోబర్ 2016 ఆదివారం, కార్తిక పూర్ణిమ 14 నవంబర్ 2016 సోమవారం, కార్తిక బహుళషష్ఠి 19 నవంబర్ 2016 శనివారం రోజున కీర్తిముఖుడిని భక్తితో ఆరాధించాలి.**

## 81 నామాలతో నిత్యం కీర్తిముఖుని ఆరాధన

వృత్తి ఉద్యోగ వ్యాపారాదులలోను, సంతాన కుటుంబ గృహఆనందాలను పొందాలని, వాస్తుదోషాలున్ననూ భయం లేకుండా సాగిపోవాలని, ఋణ శత్రుబాధలు లేకుండా, అన్యోన్య దాంపత్యంతో పది కాలాల పాటు సుఖమయ జీవితం సాగాలని ప్రతివారు కోరుకుంటారు. ఇలా పొందాలంటే శుభగ్రహమైన శుక్ర అనుగ్రహం ఉండి తీరాలి. శుక్ర మండలం పంచకోణాకారంగా ఉండును. ఈ పంచకోణాకార మండలం అంటే ఓ నక్షత్ర గుర్తు. అందుచే 5 కోణాలు,5 బీజాక్షరాలతో సమ్మిళితమై ఉన్న దివ్య పురుషుడే కీర్తిముఖుడు.

కీర్తిముఖునిలో 5 బీజాక్షర స్వరూపాలున్నాయి. ఒక్కొక్క స్వరూపానికి 16 నామాల చొప్పున, 5 స్వరూపాలకి 80 నామాలు. ఈ 80 నామాలకు చివరగా కీర్తిముఖుని నామం కలుపుకుంటే వెరసి 81 నామాలగును. అంతర్లీనంగా తెలుసుకుంటే మరో విషయం తేటతెల్లమవుతుంది. అదే సర్వతోభద్రచక్రమండలం. ఈ మండలంలో 81 గడులుంటాయి. సర్వతోభద్ర అంటే సకల శుభాలని అర్థం. స్నానం చేసిన తదుపరి నిత్యం కీర్తిముఖుడి ఎదుట నిలబడి ఓ 5 నిమిషాలలో 81 నామాలను మనఃస్ఫూర్తిగా పఠించండి. నివేదనలు లేకుండానే భక్తి విశ్వాసాలతో ప్రగాఢ నమ్మకంతో ధ్యానించండి.

ఓం బీజాక్షరంలో తెలిపిన 16 నామాలకు, గం బీజాక్షర 16 నామాలను, ఐం బీజాక్షర 16నామాలను, హ్రీం బీజాక్షర 16 నామాలను, శ్రీం బీజాక్షర 16 నామాలను కలపగా 80 నామాలగును. వీటికి చివరలో ఓం కీర్తిముఖేభ్యో నమః అనే నామం జోడించండి. వెరసి 81 నామాలగును. నిత్యం పఠించాలనుకునేవారు పై విధంగానే 81 నామాలను వరుసగా కంఠస్థం చేసి నిత్యం భక్తి ప్రపత్తులతో పఠించండి. ఈ 81 నామాలతో 5 బీజాక్షర తత్త్వాలను ప్రార్ధించిన వారగుదురు. ఇందుచే విశేష స్థితులను పొందుటకు మానసిక శారీరక రుగ్మతల నుంచి బయటపడుటకు, కామ క్రోధ మోహ మద మాత్సర్యాదుల నుంచి దూరమగుటకు, కీర్తి ప్రతిష్ఠలను సంపాదించుటకు పై 5 బీజాక్షర తత్త్వ సహిత కీర్తిముఖుడు అనుగ్రహిస్తాడు.

##  ధనూరాశి

శ్రీ మన్మథ : ఆదాయం:2, వ్యయం:8, రాజ్యపూజ్యం:6, అవమానం: 1

శ్రీ దుర్ముఖి : ఆదాయం:5, వ్యయం:14, రాజ్యపూజ్యం:4, అవమానం:5

**జనవరి 2016 :** ఆర్ధిక అంచనాలు సిద్ధం. నిరుద్యోగులకు తీపివార్తలు. స్పెక్యులేషన్ ప్రతికూలం. మాసం మధ్య నుంచి మనశ్శాంతి లభించును. గృహనిర్మాణ ఆలోచనలు సడలును. సోదర సంభాషణలను రహస్యంగా ఉంచండి. వ్యక్తిత్వలోపాలను మాసాంతంలో కప్పిపుచ్చుకోవాలి. ప్రయాణంలో సమస్యలున్నవి.జనవరి 23 మధ్యాహ్నం 2.06 నుంచి 25 రాత్రి 9.55 వరకు అనుకూలరోజులు కాదు.

**ఫిబ్రవరి 2016 :** శక్తియుక్తులతో మెప్పు పొందుతారు. వివాదాంశాలు తొలగును. ఖర్చు అధికమగును. బాధ్యతలను 2వవారంలో విస్మరిస్తారు.కీర్తి ప్రతిష్ఠలు పెరుగును. స్పెక్యులేషన్ స్వల్పంగా రాణింపు. శీఘ్రనిర్ణయాలు తగ్గును. మార్పులకై అన్వేషణ. ముంజేతి సమస్య తీరును. నిద్రలేమి, అకాల భోజనాదులు అధికము. ఫిబ్రవరి 19 రాత్రి 8.50 నుంచి 22 ఉదయం 5.28 వరకు ప్రతికూలమని భావించాలి.

**మార్చి 2016 :** మాసమంతా హడావుడి. స్పెక్యులేషన్ రాణించదు. శుభకార్య నిర్వహణ సిద్ధించును. ఇతరులపై విమర్శలు, దూషణలను తగ్గిస్తారు. తోబుట్టువులు సహకరిస్తారు. నీచ వ్యక్తుల సహవాసానికి దూరమగుదురు. బంధుప్రీతితో మాసాంతంలో నిర్ణయాలు మార్పు. మార్చి 17 అర్ధరాత్రి తదుపరి 2.23 నుంచి 20 మధ్యాహ్నం 11.35 వరకు వ్యతిరేకతేదీలు.

**ఏప్రిల్ :** విసుగు, ఆందోళన, శరీర అలసట అధికము. భాగస్వామ్య నిర్ణయాలలో మార్పులధికం. హామీ ప్రయత్నాలు నెరవేరవు. వ్యక్తిగత కక్షలు, తెరచాటు వ్యవహారాలు తగ్గిస్తారు. ఉద్యోగులకు అధికారుల నుంచి సమస్యలు కలవు. సంతానంచే విమర్శలుండును. ఆదాయగండిని ఇతర మార్గాలలో పూడ్చుకుంటారు. ఏప్రిల్ 14 ఉదయం 8.32 నుంచి 16 సాయంత్రం 5.17 వరకు వ్యతిరేక సమయంగా భావించాలి.

**మే :** శ్వాసనాళ, భుజ, ముంజేతి సమస్యలు పెరుగును. వ్యక్తిగత ప్రతిష్ఠలు తగ్గును. ఊహించని ఖర్చులు ఎదురగును. బంధుప్రీతి పెరుగును. ఊహాగానాలతో పయనిస్తారు. అసత్య ఆరోపణలు, విమర్శలు చేస్తుంటారు. జీవనస్థితిపై మెరుగైన ఆలోచనలను చేయలేరు. అమావాస్యకు ముందు వెనుకలలో స్వల్ప ఆర్ధిక లబ్ధి. మే 11 సాయంత్రం 4.30 నుంచి 13 రాత్రి 11.56 వరకు అనుకూల సమయం కాదు.

**జూన్ :** అవినీతి కార్యాలను వ్యతిరేకిస్తారు. రహస్య మంతనాలు ఉండును. వాహనచోదకంలో జాగ్రత్త అవసరం. 2వ పక్షంలో పూర్తిగా అనుకూలం. అవివాహితులకు వివాహయోగము. ధైర్య సాహసాలతో శస్త్ర చికిత్సకు మొగ్గు చూపుదురు. గోప్యతలను పూర్తిగా వ్యతిరేకిస్తారు. జూన్ 7 అర్ధరాత్రి 2.00 నుంచి 10 ఉదయం 8.06 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవాలి.

**జూలై :** స్థిరాలోచనపై దృష్టి ఉంచుదురు. ఆశలు నిరాశలు కావు. శక్తికి మించిన కార్యాలు చేపట్టి లబ్ధి పొందుదురు. ఋణవిషయంలో జాగ్రత్తలు తీసుకుంటారు. వివాహసౌఖ్యం, మృష్టాన్న భోజనం, ఆర్ధిక వెసలుబాటు కల్గును. 2వ పక్షమంతా ఆశాజనక స్థితిగతులు. ముఖ్యప్రయాణాలు రద్దు కాగలవు. శత్రువులపై కాలుదువ్వవద్దు. జూలై 5 మధ్యాహ్నం 11.44 నుంచి 7 సాయంత్రం 5.12 వరకు ప్రతికూల సమయం.

**ఆగస్టు :** స్థానచలన అవకాశములు కలవు. పంతాలకు, పట్టింపులకు వెళ్తారు. రోగబాధలకు ఉపశమనం. కుటుంబ నిర్ణయాలు లాభించును. భాగస్వామ్య చర్చలు నెరవేరును. ఆగస్టు 1 రాత్రి 8.19 నుంచి 3 అర్ధరాత్రి 2.07 వరకు తిరిగి 28 అర్ధరాత్రి 3.06 నుంచి 31 ఉదయం 9.49 వరకు ప్రతి అంశంలో జాగ్రత్త వహిస్తూ నిర్ణయాలు తీసుకుంటూ ఉండాలి.

**సెప్టెంబరు :** కల్మషఅంశాలకు దూరంగా ఉంటారు. దినచర్యలో అధికమార్పులు చేస్తారు. స్పెక్యులేషన్‌లో దూకుడును తగ్గిస్తారు. వాగ్ధోరణిలో అసత్యాలు దొర్లును. మనోసంకటాలను పారద్రోలుదురు. మాతృవర్గీయులచే లబ్ది. కీర్తిప్రతిష్ఠలను రక్షించుకుంటారు. 2వ వారంలో గొప్ప వ్యక్తుల పరిచయాలు కల్గును. సెప్టెంబరు 25 ఉదయం 8.38 నుంచి 27 సాయంత్రం 4.00 వరకు ప్రతికూల సమయం.

**అక్టోబరు :** వ్యక్తిగత నిర్ణయాలకు పెద్దపీట వేస్తారు. అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగును. సాత్వికత్వం, చలాకీతనం, చిరుమందహాసాలతో ఇతరులను ఆకర్షిస్తారు. పోటీలను ఎదుర్కొంటారు. హామీ ప్రయత్నాలు నెరవేరును. న్యాయసలహాలు తీసుకుంటారు. చేదు అనుభవాలను తిప్పి కదుదురు. అక్టోబరు 22 మ 2.35 నుంచి 24 రాత్రి 9.32 వరకు వ్యతిరేకసమయం.

**నవంబరు :** సంతానంపై విమర్శలుండును. కుటుంబకలతలు రాగల సూచన కలదు. వివాదవిషయాలలో జోక్యం చేసుకుంటారు. బంధుప్రీతిని స్వాగతించలేరు. సంజాయిషీ, క్షమాపణలు సిద్ధంగా ఉంటాయి. రాజీ ధోరణి వైపు వెళ్లరు. సహచరులతో సంయమనం పాటించలేరు.రెండవ పక్షంలో వ్యూహాత్మకంగా పావులు కదపాలి. నవంబరు 18 రాత్రి 10.36 నుంచి 20 అర్ధరాత్రి తదుపరి 4.02 వరకు ప్రతికూల సమయం.

**డిశంబరు:** వాహనచోదకంలో జాగ్రత్తలు తీసుకుంటారు. అవివాహితులకు అదృష్ట యోగం. మాసం మధ్యలో కుటుంబ సమస్యలు తలెత్తును. పరనింద ఆరోపణలు పెరుగును. దూరప్రయాణాలు రద్దగును. ఉదర సమస్య లోపంతో వైద్యసేవలుండును. ఆర్థికమాంద్యం ఉండదు. 3వ వారంలో ఆత్మవిశ్వాసం పెరుగును. భాగస్వామ్య చర్చలు నెరవేరును. డిశంబరు 16 ఉదయం 8.54 నుంచి 18 మధ్యాహ్నం 12.40 వరకు అనుకూల సమయం కాదు.

